3. Aśvaśāstram
4. Vividha Vaidya Viṣayagaḷu
5. Saṅgītaratnākarā
6. Sūpaśāstra

## ISLAMIC LANGUAGES

1. Jamil-Al-Ashya
2. Tibb-E-Faridi
3. Tahqiq-Al-Buhran
4. Safinat-Al-Najat

---

## "B" FROM THE TANJORE MAHARAJA SERFOJI'S SARASVATHI MAHAL LIBRARY, TANJORE

### TAMIL

1. Śarabendra Vaidya Muṟai (Diabetes)
2. Do. (Eyes)
3. Do. (Anaemia)
4. Do. (Śvāsakāsam)
5. Agastiyar 200
6. Koṅkaṇarśarakku Vaippu
7. Tirucciṟṟambalakkovaiyār with Padavurai
8. Tālasamudram
9. Bharatanāṭyam
10. (a) Paṇḍikēḷi Vilāsa Nāṭakam
    (b) Purūrava Cakravarti Nāṭakam
    (c) Madana Sundara Vilāsa Nāṭakam
11. Percy Macqueen's Collection of Folklore in the Madras University Library
12. Rāmaiyaṉ Ammāṉai

### TELUGU

1. Kāmandakanītisāramu
2. Tāladaśāprāṇapradīpikā
3. Raghunātha Nāyakābhyudayamu
4. Rājagōpāla Vilāsamu
5. Rāmāyaṇamu by Kaṭṭa Varadarāju

## MAHRĀṬHI

1. Nāṭyaśāstra Saṅgraha
2. (a) Book of Knowledge
   (b) Folk Songs
   (c) Dora Darun Veṇi Paddhati
   (d) Asvasa Catula Dumani
3. (a) Pratāpasimhendra Vijaya Prabandha
   (b) Sarabhendra Tīrthāvali
   (c) Lāvaṇi
4. Devendra Kuravañji
5. Bhakta Vilāsa
6. Śloka Baddha Rāmāyaṇa

## SANSKRIT

1. Aśvaśāstra with Tricolour illustrations
2. Rājamṛgāṅka
3. Ānandakandam
4. Āyurvedamahodadhi
5. Gīta Govinda Abhinaya
6. (a) Coḷacampū
   (b) Sāhendra Vilāsa
7. Dharmākūtam—Sundara Kāṇḍa.
8. Jātakasāra
9. Viṣṇutattvanirṇaya Vyākhyā
10. Saṅgīta Darpaṇa
11. Bījapallava

During 1950, only the Sub-committee for TAMIL, TELUGU and KANNADA met in the month of July 1950 at Madras.

The following books were taken up for publication in the various languages during 1950–51.

## TAMIL

1. Daṭcaṇāyaṇār-Vaiddiya-Aṭṭavaṇai
2. Vaiddiyak Kalañciyam
3. Anubhava Vaiddiya Muṟai Vol. 3

## TELUGU

1. Śaivācārasaṅgrahamu
2. Anubhava Vaidyam
3. Abhinayadarpaṇamu

## SANSKRIT

1. Ārogyacintāmaṇi
2. Tattvasāra with Ratnasāriṇī
3. Sūtrārthāmṛta Lahari
4. (a) Ratnadīpikā
   (b) Ratnaśāstra

## MALAYĀLAM

1. Aśvacikitsa
2. Phalasārasamuccaya

## KANNAḌA

1. Vaidya Sāra Saṅgraha

During 1951-52, only the Sub-committees for TAMIL, ELUGU and MALAYALAM met in the month of April 1951. ıe following books were taken up for publication in the various nguages.

## TAMIL

1. Saptariṣināḍi
2. Karnāṭakarājākkaḷ Savistāra Caritram
3. Bharata Siddāntam
4. Pillaippiṇivākaṭam
5. Anubhava Vaiddiyam Vol. 4
6. Māṭṭuvākaṭam

## TELUGU

1. Brahmavidyā Sudhārṇavamu
2. Rāgatāḷacintāmaṇi
3. Vaidyacintāmaṇi
4. Kumārarāmuni Kathā
5. Kāṭamarāju Kathā

## SANSKRIT

1. Devakeralam—Candrakaḷā Nāḍi
2. Pātañjala Yogasūtra Bhāṣya Vivaraṇa by Sri Śaṅkarācārya

## MALAYĀLAM

1. Kiḷivaṇḍusamvādam
2. Advaita Vedāntam
3. Bārhaspatyasūtra with Malayālam commentary
4. Karaṇapaddhati

## KANNAḌA

1. Sadgururahasyam

## ARABIC

2. Shawakil-Ul-Hur

It is hoped that the publication of most of the important manuscripts will be completed within the next four years.

Some of the manuscripts taken up for publication are represented by single copies in the Library and consequently the mistakes that are found in them could not be corrected by comparing them with other copies. The editors have, however, tried their best to suggest correct readings. The wrong readings are given in round brackets and correct readings have been suggested in square brackets. When different readings are found, they have been given in the footnotes except in the case of a few books in which the correct readings have been given in the footnote or incorporated in the text itself.

The Government of Madras have to be thanked for financing the entire scheme of publication although there is a drive for economy in all the departments. My thanks are due to the members of the Expert Committee who spared no pains in selecting the manuscripts for publication. I have also to thank the various editors, who are experts in their own field, for

readily consenting to edit the manuscripts and see them through the press. The various Presses that have co-operated in printing the manuscripts in the best manner possible also deserve my thanks for the patience exhibited by them in carrying out the corrections made in the proofs.

This edition is based on a single palm leaf manuscript preserved in the Govt. Oriental Mss. Library, Madras, described under D. No. 2458. This is a Telugu rendering in verse form of *Vaidyacintāmaṇi* of *Indrakānti Vallabhārya* in Sanskrit by *Dhēnukoṇḍa Kēsavakavi*. The book deals with the diagnosis of different diseases, medicines and the method of their preparation.

Government Oriental Manuscripts Library, Madras.
Date 26—2—1952.

T. CHANDRASEKHARAN,
*General Editor.*

# INTRODUCTION

I have once more to express my gratitude to the Curator of the Oriental Manuscripts Library, Madras for having given me an opportunity to edit another medical work, in Telugu, viz Andhra Vaidya Cintamaṇi.

The author of this work is Dhēnukoṇḍa Kēsavāmāthya. At the commencement of the work he says that he is writing in Telugu Poetry, a work orginally found in Sanskrit – 'Vaidya Cintāmaṇi' written by Indrakaṇṭi Vallabhacārya. Though this work is in Sanskrit it is clear that the author is an Andhra as his work is found in use only in Andhra parts.

The work 'Vaidya Cinṭāmaṇi' consists in it, the Nidānam & Cikitsā of diseases, with special reference to the use of mineral preparations viz Bhasmas, Sindooras, Rasas etc. It also contains a chapter on Karma Vipāka. This work is held in high esteem by the physicians of those parts.

Though the author of the present Telugu work states that he has followed the original 'Vaidya Cinṭāmaṇi', it does not appear to be completely adopted. Only the Asṭā Sthāna Parīksā, the Nidanam of Jvaras, Sannipāta and Atisāra and important formulae are taken from it.

An experienced physician will easily recognise that the prescriptions chosen are highly valuable.

There is also another work of the same name but written by Devulapalli Venkatanarasa Kavi which is already published by Dr. A. Lakshmipathi, several years earlier.

While editing the present work I have made only slight modifications in the 'metre' without changing the ingredients or the form of the preparations, where it was considered absolutely necesary. I have also to express my heartfelt thanks to Ayurveda Bhushana Sri Vetturi Sankara Sastry Garu, Editor of Sri Dhanvantari, Mukthyala, who had lent me his Jonrnals in which the present work appeared in parts.

My grateful thanks are also due to Sri Bhasha Praveena Mallampalli Sarabhayya Sastry Garu, the Telugu Pandit of Oriental Manuscripts Library, for helping me in both editing this work and in the correction of proofs.

M. VISVESWARA SASTRY.

# పీఠిక.

ఆయుర్వేద ప్రయోజనమును నిర్వచించుచు సుశ్రుతాచార్యుఁడు

"స్వస్థస్యస్వాస్థ్యరక్షణం, ఆతురస్యరోగప్రశమనమ్"

అని వక్కాణించియున్నాఁడు. ఇందు స్వాస్థ్యరక్షణమునకై దినచర్యా విధానములను, ఆయుర్వేదాచార్యులు పెక్కిఁటిని నిర్ణయించియున్నారు.

స్వాస్థ్యమునకు భంగమేర్పడుటయే వ్యాధి. వ్యాధి యన్నను రోగమన్నను శరీరమునకు బాధను గలిగించునది యనియర్థము.

ఇట్టివ్యాధియేర్పడుటకుఁ గారణమేమియని యాలోచించినచో,

"యేషామేవహిభావానాం సంపత్సంజనయేన్నరం
తేషామేవవిపద్వ్యాధీన్వివిధాన్సముదీరయేత్"

అని చరకాచార్యుఁడు చెప్పినట్లు ఏభావములసంపత్తి శరీరస్వాస్థ్యమునకుఁ గారణమో నట్టిభావముల విపత్తియే వ్యాధికిఁ గారణమని యేర్పడుచున్నది. ఈ భావముల స్వరూపమును నిర్ణయించుచో నాతఁడే యిట్లు చెప్పెను.

"ఆత్మేంద్రియమనోఽర్థానాం యోఽయం పురుషసంజ్ఞకః
రాశిరస్యామయానాం చ"

ఆత్మ, ఇంద్రియములు, మనస్సు, శబ్దాదివిషయములు, ననువానియొక్క సమాహారమే పురుషుఁడు. ఆతఁడే యామయములకును నధిష్ఠానము.

కాలము, అర్థము, కర్మ, అనునీమూఁడిఁటియొక్క హీనమిథ్యాఽతియోగములే యట్టిభావములకు విపత్తియేర్పడుటలోఁ గారణములగుచున్నవి.

హీనయోగము_అనఁగా శీతోష్ణవర్ష ప్రధానములగు కాలములకుఁ గాని, శబ్దస్పర్శరూపరసగంధములను నర్థములకుఁ గాని, కాయిక వాచిక మానసికాత్మకమగు కర్మకుఁ గాని శరీరమునందుఁ, దక్కువ సంబంధము.

అతియోగము- అనఁగా వీని యెక్కువ సంబంధము.

మిథ్యాయోగము- అనగా, నస్వాభావికమగు సంబంధము

వీనిలో నొక్కొక్కటిగాని, యీమూఁడును గలసి కాని వ్యాధికిఁ గారణములగుచున్నవి.

అనఁగా నిట్టి హీనమిథ్యాఽతి యోగములవలన శరీరభావముల యందు వ్యత్యాస మేర్పడుచున్నదని భావము. ఈ శరీరభావములలో, ఆత్మ, మనస్సు, ఇంద్రియములు, అనునవి సూక్ష్మాంశములుగను, అర్థములు, లేకవివయము లు, అనునవి స్థూలాంశములుగను నిర్ణయింపఁబడినవి. శరీరమునందలి స్థూలాంశములు పంచేంద్రియగ్రాహ్యములు. అవియే శబ్దస్పర్శరూపరసగంధములు. ఈ శబ్దస్పర్శరూపరసగంధములే తన్మాత్రరూపమున నుండి పంచ మహాభూతములకుఁ గారణములగుచున్నవి. అనఁగా* శబ్దతన్మాత్రనుండి యాకాశమును, స్పర్శతన్మాత్రనుండి వాయువును, రూపతన్మాత్రనుండి యగ్నియును, రసతన్మాత్రనుండి జలమును, గంధతన్మాత్రనుండి పృథివియును, గలుగుచున్నవి. ఈపంచభూతములయొక్క సముదాయమే జీవునితో సంయోగమును బొందినపుడు "పురుష" లేక "శరీరి" అను సంజ్ఞలను బొందుచున్నది, శారీరతత్త్వజ్ఞులు. ఈ పంచభూతములను జీవునిఁ జేర్చి షడ్ధాతువుల నేర్పరచిరి.

"షడ్ధాతవస్సముదితాః పురుష ఇతి సంజ్ఞాంలభన్తే"
తద్యథా పృథివ్యాపస్తేజోవాయురాకాశం,
బ్రహ్మచాఽవ్యక్తమిత్యేత ఏవ
షడ్ధాతవస్సముదితాః పురుష ఇతి సంజ్ఞాంలభన్తే"

చరకాచార్యులు

షడ్ధాతుజమగు దేహమునకుస్థూల భావములుమూఁడు.

" దోషధాతు మలా మూలం సదా దేహస్య "

వాగ్భటాచార్యులు.

అవి, దోషములు, ధాతువులు, మలములు, అనునవి. ఇందు ధాతువులు దేహధారణమునకును, దోషములు దేహప్రవర్తనకును మలములు దేహమునందలి నిరర్థకద్రవ్యముల నిరాకరణమునకును సాధనము లగుచున్నవి.

రస రక్త మాంస మేదోఽస్థి మజ్జా శుక్రము లనునవి యేడును ధాతువులు. ఈ సప్తధాతువులయొక్క సారమేయగు "ఓజస్సు" కొందఱిచే నష్టమధాతువుగఁ జెప్పఁబడినది.

ఈ సప్తధాతువుల నాశ్రయించి వీని సముదాయాత్మకమైన దేహముయొక్కస్థితికిఁ బ్రవర్తకములైనవి వాతపిత్తకఫములు. ఇవి సమస్థితియందుండి దేహమును సక్రమముగఁ బ్రవర్తింపఁజేయఁగల దశయందు వీనినిఁగూడ ధాతువులనియే యందురు. కానియివి దుష్టములై రోగమునకుఁ గారణములగు దశయందు వీనినే దోషములందురు. కాని, దేహదూషణస్వభావముగూడ వీనికుండుటచేతను, అదియే వ్యాధికిఁ గారణమగుటఁజేసియు, రోగములకు దోషములకుఁగల సంబంధమును వ్యక్తపరచుటకై వీనికి దోషములను వ్యవహారము ప్రసిద్ధమైనది.

ఇక మలములనునవి- మూత్రపురీషస్వేదములను స్థూలమలములును, కర్ణనేత్రదంతనఖాది సూక్ష్మమలములును మలశబ్దవాచ్యములు. మఱియును వాతపిత్త కఫములుగూడ దుష్టములై దేహప్రవర్తనమునకనర్హములైనపుడు వానినిఁగూడ మలములనియేయందురు. వాతపిత్తకఫములచే దూషింపఁజేయఁబడు స్వభావముగల వగుటవలన, సప్తధాతువులును, మలములును, గూడ "దూష్యము" లని వ్యవహరింపఁ బడుచున్నవి.

వాతపిత్తకఫములు శరీరమును ప్రవర్తింపఁజేయుచున్నవను నపుడు గమనింపవలసిన విషయమేమన- శరీరమునందలి కదలికకు సంబంధించిన కృత్యము లన్నియును. అనఁగా, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, చేష్ట, ఉత్సాహము, ధాతువుల సమ్యగ్గమనము, మలాదుల బహిఃప్రవర్తనము, వాతము వలనను,

ఆహారపాకము, ఉష్ణము, చూపు, కాంతి, బుద్ధి, శౌర్యము, శరీర మార్దవము, అనునవి పిత్తమువలనను,

స్థైర్యము, సంధిదార్ఢ్యము, క్షమ మున్నగునవి కఫమువలనను, శరీరమునకు నేర్పడుచున్నవి. సమస్థితియందు దేహమును సక్రమముగ నడుపఁగల యీదోషములే మిథ్యాహారవిహారముల వలన విషమస్థితి నందినవై రోగములను గలిగించుచున్నవి. అనఁగా దోషములవైషమ్యమే రోగమని యేర్పడుచున్నది.

"రోగస్తు దోషవైషమ్యం దోషసామ్య మరోగతా"

వ్యత్యస్తములగు దోషములను సమస్థితికిఁ దెచ్చుటయే చికిత్సా ప్రయోజనము. దీనినే చరకాచార్యులు

"ధాతుసామ్యక్రియా చోక్తా తంత్రస్యాఽస్య ప్రయోజనం"

అని నిర్వచించిరి.

చికిత్స యెనిమిదివిధములుగ విభజింపఁబడినది. అవి కాయ, బాలగ్రహ ఊర్ధ్వాంగ, శల్య, విష, రసాయన, వాజీకరణము లనునవి. ఈ యష్టవిధ చికిత్సా విభాగము బ్రహ్మప్రోక్తమని యాయుర్వేద తంత్రములందుఁ జెప్పఁబడుటవలన నివి వేదకాలమునుండియు ప్రత్యేకముగఁ బేర్కొనఁబడినవని తెలియనగుచున్నది. ఆయుర్వేదము తంత్రరూపమునందిన తరువాత గూడ చరకసుశ్రుతాది గ్రంథములందును, ఈవిభజనము ననుసరించియే విషయవిభాగము చేయఁబడినది. సుశ్రుతునకుఁ బిమ్మట శల్య తంత్రమాచరణ ప్రచారణములనుండి దూరమైనను మిగిలిన తంత్రములన్ని

యును నేఁటివఱకు ననుసరింపఁ బడుచు నేయున్నవి. తంత్రయుగమునకు తరువాత సంగ్రహగ్రంథములు పెక్కువచ్చినవి. అట్టి సంగ్రహగ్రంథములలో నాంధ్రదేశమున బహుళ ప్రచారముగలవానిలో వైద్యచింతామణి యును బసవరాజీయమును బేర్కొనఁదగినవి. ఇందు చికిత్సకు ముఖ్యములగు రోగనిదానమును ఔషధమును ప్రధానముగ గ్రహింపఁబడి వైద్యులచే ప్రాయికముగ ననుసరింపఁబడుచున్నవి. ఆర్యసంప్రదాయమునకుఁ జెందిన యాయుర్వేదము వ్యాప్తియందుఁగల యుత్తరదేశమునకును, సిద్ధసంప్రదాయము ప్రధానముగఁగల దక్షిణదేశమునకును నడుమనుండుటచే నాంధ్రవైద్య సంప్రదాయము, సిద్ధాయుర్వేద సంప్రదాయముల సమ్మేళనమనఁ దగియున్నది.

ఆంధ్రదేశమున బహుళ ప్రచారముననున్న వైద్యగ్రంథములలో నొత్తరాహవైద్యగ్రంథములలోఁ గానరాని విశేషాంశములు, ముఖ్యముగ రసౌషధములకుఁ జెందినవి పెక్కులుగలవు. ఉత్తరదేశమున వెల్వడిన యాధునిక గ్రంథములయందు రసయోగములు పెక్కులున్నను, ఆంధ్రదేశగ్రంథములయందు దక్షిణదేశమునకుఁ జెందిన విశేషరసయోగములు గలవు. అట్టివానిలో కట్టు - ఔషధములు ముఖ్యములు.

ఇందును విశిష్టౌషధములకు భైరవయోగములనియందురు. అట్టివి యీ గ్రంథమునఁ బెక్కులు గానవచ్చుచున్నవి. మన దేశమునఁ బ్రసిద్ధములగు బసవరాజీయ వైద్యచింతామణుల యందు నితరాయుర్వేద గ్రంథములలోఁ గానరాని "కర్మవిపాక" మధికముగఁ జేర్పబడినది. వైద్యచింతామణియను గ్రంథమునకుఁ గర్త యింద్రగంటివల్లభాచార్యుఁడు. అదిసంస్కృతముననున్నది. సంస్కృతభాషా పరిచయముచాలని దేశీయులయుపయోగమునకై యీ గ్రంథమును గొందఱు పద్యరూపమునఁ దెనుఁగున కనువదించిరి. అట్టివానిలోఁ బ్రకృత గ్రంథమొకటి. ఇది మూలమునకు సమగ్రమైనయనువాదము కాదు. అందుండి యష్టస్థానపరీక్ష, జ్వరనిదానము, అతిసారనిదానము, నను నిదానాంశములను, కొన్ని కషాయ ధూప ధూమాంజనములను మాత్రము చేర్చి కేశవా

మాత్యుఁడీ గ్రంథమును రచించియున్నాఁడు ఈ గ్రంథముకాక "ఆంధ్ర వైద్యచింతామణి" అనుపేర నింకొక యనువాదముగూడ వైద్యచింతామణికిఁ గానవచ్చుచున్నది. అది కాశ్యపగోత్రజుఁడగు దేవులపల్లి వేంకట నరసకవికృతము. అదికూడ దీనివలనే సమగ్రమైన యనువాదముకాదు ఆగ్రంథము డాక్టరు శ్రీ ఆచంట లక్ష్మీపతిగారిచే నింతకుఁ బూర్వమే ప్రచురింపఁబడినది.

ప్రకృతగ్రంథకర్తయగు కేశవామాత్యుని యింటిపేరు, ధేమ్ముకొండవారు, తండ్రిపేరు జోగనామాత్యుఁడు, 'భిషక్శాస్త్రప్రవీణ' అను బిరుద మీగ్రంథకర్తకుఁగలదు.

"వసుధలోపలఁ గురకురవైద్యులెల్లఁ
బెక్కునేర్తుమటంచును బేల్లుపడుదు
కాని వైద్యంబు తచ్ఛాస్త్రగతి గనుంగొ
నంగనేర్తురె! వట్టి వెడంగుగాని"

అనుటచే శాస్త్రానుభవములు రెండును నీయనయందు నిండారియున్నవని తెలియుచున్నది.

"కందము వెలిగాఁ బద్యము
లందుల పాదమ్ములధిక మగునట్లుగ నే
నందముగను జెప్పెదఁగవి
బృందము సంతసముగొందఁ బృథివీస్థలిలోన్"

తెనుగునఁ బద్యరూపమునఁ బరివర్తితములైన యిట్టి జ్యోతిర్వైద్య సంగీత శాస్త్రవిషయప్రధానములగు గ్రంథములయందు నాయా శాస్త్ర విషయప్రతిపాదనమే ప్రధానలక్ష్యముగావునఁ గావ్యములయందువలె ఛందోవ్యాకరణాది నియమములంతగాఁ బాటింపఁబడక పోవుటయేకాక విషయానురోధమువలనఁ గ్వాచిత్కముగ లక్షణమతిక్రమింపఁ బడుటయును, లక్షణానురోధమువలన విషయప్రతిపాదన గొన్నియెడలం గుంటువడి యస్పష్టత యేర్పడుటయును గానసగును. తెనుఁగుపద్యరచన కున్నని

యమబాహుళ్యమట్టిది. ఇందువలననే, వ్యర్థపదములు, వైరిపదములు, లక్షణభంగములు, కొన్నియెడలవాక్యయోజనముసరిలేకపోవుట, మున్నగునవి తప్పని సరియగుచుండును. గ్రంథోద్దేశ్యమును బరిగణించి వీని నుపేక్షింపవలసియుండును.

ప్రకృత గ్రంథరచన ప్రాయికముగనిట్టి దోషముల కందకయే నడచినదనవచ్చును. కాని లేఖకపరంపరాజనితములగు దోషములు మెండగుటవలన యథామతిని సాధుపాఠములు గుర్తింపఁబడినవి. వాక్య యోజనకై వలయునెడల నలతి మార్పులుచేయబడినవి. మార్పులనఁగా ఉన్నపదములను యుచితస్థలములకు సద్దుటమాత్రమే. ఈ గ్రంథము భద్రాద్రి నిలయుఁడగు శ్రీరామచంద్రున కంకితము

ప్రకృతగ్రంథమును ఆయుర్వేదభూషణ శ్రీ వేటూరి శంకర శాస్త్రిగారు తమ ధన్వంతరి పత్రికాముఖమునఁ బ్రకటించియుండిరి. ఈ గ్రంథసంస్కరణమున్నకది చాలవఱకుపయోగించినది. సమయము నకు నాకాప్రతుల నందఁజేసినందులకు వారికి నా యభివందనములు.

ఏతద్గ్రంథ సంపాదనావకాశమును నాకుఁ గల్పించిన ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారాధ్యక్షులు శ్రీయుతులు టి. చంద్రశేఖరన్. M. A L. T. గారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

ఈ గ్రంథ సంస్కరణమునందును ప్రూఫులను జూచుటయందును నాకు సాహాయ్య మొనరించిన ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారాంధ్ర పండితులను, నాకుబంధువులు నగు శ్రీమల్లంపల్లి శరభయ్యా శాస్త్రిగారికి నా హృదయపూర్వకమైన ఆశీర్వాదములు.

చెన్నపురి

2-2-52

ములుగు విశ్వేశ్వరశాస్త్రి

# విషయసూచిక


| | పుట |
|---|---|
| **1. ఆశ్వాసము** | |
| ప్రస్తావన | 1 |
| షష్ఠ్యంతములు | 2 |
| స్వరూపలక్షణము | 6 |
| స్పర్శలక్షణము | ,, |
| మలపరీక్ష | ,, |
| మూత్రపరీక్ష | 7 |
| జిహ్వాపరీక్ష | ,, |
| శబ్దపరీక్ష | 8 |
| నేత్రపరీక్ష | ,, |
| అజీర్ణభేదములు : లక్షణములు | ,, |
| జ్వరభేదములు : లక్షణములు | 9 |
| వాతజ్వర లక్షణములు | ,, |
| పైత్యజ్వరలక్షణములు | 10 |
| శ్లేష్మజ్వరలక్షణములు | ,, |
| వాతపిత్తజ్వరలక్షణములు | ,, |
| వాతకఫజ్వర లక్షణములు | ,, |
| పిత్తకఫజ్వరలక్షణములు | ,, |
| భూతజ్వరలక్షణములు | 11 |
| అజీర్ణజ్వరలక్షణములు | ,, |
| అభిఘాతజ్వరలక్షణములు | ,, |
| ఆహికజ్వరభేదలక్షణములు | 12 |
| రసధాతుగతజ్వర లక్షణములు | 13 |
| త్వగ్గతజ్వరము | ,, |
| రక్తధాతుగతజ్వరలక్షణము | ,, |
| మాంసధాతుగతజ్వరము | 14 |
| మేదోధాతుగతజ్వరము | ,, |
| అస్థిధాతుగతజ్వరము | ,, |
| మజ్జాధాతుగతజ్వరము | ,, |
| శుక్రధాతుగతజ్వరము | ,, |
| సన్నిపాతజ్వరము | 15 |
| సన్నిపాతజ్వర సాధ్యాసాధ్యలక్షణములు | ,, |
| సంధిక సన్నిపాతము | 16 |
| హాంతకసన్నిపాతము | ,, |
| రుగ్దాహసన్నిపాతము | ,, |
| చిత్తవిభ్రమసన్నిపాతము | ,, |
| శీతాంగసన్నిపాతము | ,, |
| తాంద్రికసన్నిపాతము | 17 |
| కంఠకుబ్జసన్నిపాతము | ,, |
| కర్ణికసన్నిపాతము | ,, |
| భుగ్ననేత్రసన్నిపాతము | ,, |
| ప్రలాపసన్నిపాతము | 18 |
| రక్తష్ఠీవిసన్నిపాతము | ,, |
| జిహ్వాకసన్నిపాతము | ,, |
| అభిన్యాససన్నిపాతము | ,, |
| సన్నిపాతజ్వర దినప్రమాణము | ,, |
| సప్తదోషజ్వర లక్షణము | 19 |
| అతిసారనిదానము | 21 |
| వాతాతిసారము | 22 |
| పిత్తాతిసారము | ,, |
| శ్లేష్మాతిసారము | ,, |
| ఉష్ణాతిసారము | ,, |
| సంసర్గాతిసారము | ,, |
| అసాధ్యలక్షణములు | 23 |
| జ్వరదినచర్య | 25 |
| లంఘనపథ్యములు | 27 |

## 2. ఆశ్వాసము


| | | | పుట |
|---|---|---|---|
| రసశోధనము | 28 | లవణములశుద్ధి | 38 |
| సప్తకంచుకదోషములు | 29 | సర్జక్షారశుద్ధి | ,, |
| నాగదోషనివారణము | ,, | యవక్షారశుద్ధి | 39 |
| మలదోషనివారణము | ,, | శిలాజతుశుద్ధి | ,, |
| అగ్నిదోషనివారణము | ,, | ఇంగువశుద్ధి | ,, |
| విషదోషనివారణము | 30 | కుంకుమపువ్వుశుద్ధి | ,, |
| గిరిదోషనివారణము | ,, | గజపిప్పలిశుద్ధి | ,, |
| వంగదోషనివారణము | ,, | విషముష్టివిత్తులశుద్ధి | 40 |
| చపలదోషనివారణము | ,, | శొంఠిశుద్ధి | ,, |
| రసక్షాళనము | ,, | మిరియాలశుద్ధి | ,, |
| రసభస్మప్రకారము | 31 | వాముశుద్ధి | ,, |
| రససిందూరప్రకారము | ,, | శంఖశుద్ధి | 41 |
| రససిందూరగుణము | ,, | ఇతరరసద్రవ్యములశుద్ధులు | ,, |
| అభ్రకము | 32 | గ్రంధిద్రవ్యశుద్ధులు | ,, |
| ధాన్యాభ్రకవిధి | 33 | పుటసంజ్ఞ | 42 |
| అభ్రకభస్మవిధి | ,, | స్వర్ణశుద్ధి | ,, |
| మణిశిలాశుద్ధి | 34 | స్వర్ణభస్మ | ,, |
| మాక్షికశుద్ధి | ,, | స్వర్ణసిందూరము | ,, |
| కఫరిశుద్ధి | 35 | కాంస్యశుద్ధి | 43 |
| ఇంగిలీకశుద్ధి | ,, | కాంస్యభస్మ | ,, |
| టంకటశుద్ధి | ,, | వజ్రమూష | 44 |
| విమలశుద్ధి | ,, | కాంస్యసిందూరము | ,, |
| మైలతుత్థముశుద్ధి | 36 | శ్రేష్ఠకాంతలక్షణములు | 45 |
| పాతతుత్థముశుద్ధి | ,, | కాంతశుద్ధి | ,, |
| గంధకశుద్ధి | ,, | కాంతభస్మ | ,, |
| గౌరిపాషాణశుద్ధి | ,, | కాంతసిందూరము | 46 |
| ఇతరపాషాణశుద్ధులు | ,, | రౌప్యశుద్ధి | ,, |
| వేపాళములశుద్ధి | 37 | రౌప్యభస్మ | ,, |
| నాభిశుద్ధి | ,, | రౌప్యసిందూరము | 47 |
| ఆముదముశుద్ధి | ,, | శ్రేష్ఠమండూరము | 48 |
| గుగ్గులుశుద్ధి | ,, | మండూరభస్మ | ,, |

| | పుట |
|---|---|
| మండూరసిందూరము | 43 |
| లోహశుద్ధి | 49 |
| లోహభస్మ | ,, |
| తామ్రశుద్ధి | 51 |
| తామ్రభస్మవిధి | ,, |
| తామ్రసిందూరము | 52 |
| తామ్రభస్మగుణము | ,, |
| పిత్తళశుద్ధి | ,, |
| పిత్తళభస్మ | 53 |
| పిత్తళసిందూరము | ,, |
| నాగవంగశుద్ధి | ,, |
| నాగభస్మ | ,, |
| నాగసిందూరము | 54 |
| వంగభస్మ | ,, |
| వంగసిందూరము | ,, |
| నాగవంగభస్మగుణము | ,, |
| విద్రుమధారణగుణము | 55 |
| విద్రుమశుద్ధి | ,, |
| విద్రుమభస్మవిధి | ,, |
| మౌక్తికధారణగుణము | ,, |
| మౌక్తికశుద్ధి | 56 |
| మౌక్తికభస్మ | ,, |
| వజ్రధారణగుణము | ,, |
| శ్రేష్ఠవజ్రలక్షణము శుద్ధి | ,, |
| వజ్రభస్మ | ,, |
| మరకతగుణము | 57 |
| గరుడపచ్చశుద్ధి | ,, |
| గరుడపచ్చభస్మము | ,, |
| నీలగుణము | ,, |
| భస్మవిధి | ,, |
| పద్మరాగలక్షణగుణములు | 58 |

| | పుట |
|---|---|
| పద్మరాగశోధనము | 58 |
| పద్మరాగభస్మము | ,, |
| పుష్యరాగలక్షణము గుణము | ,, |
| పుష్యరాగశుద్ధి భస్మము | 59 |
| గోమేధికలక్షణము | ,, |
| గోమేధికశుద్ధి | ,, |
| గోమేధికభస్మము | ,, |
| వైదూర్యలక్షణము · గుణము | 60 |
| వైదూర్యశుద్ధి | ,, |
| వైదూర్యభస్మ | ,, |
| **3. ఆశ్వాసము** | |
| రసభాగ్నికుమారము | 62 |
| నవలోహాగ్నికుమారము | 63 |
| రత్నాగ్నికుమారము | ,, |
| సిద్ధాగ్నికుమారము | 64 |
| లఘ్వగ్నికుమారము | ,, |
| మహాగ్నికుమారము | 65 |
| ప్రతాపాగ్నితిమారము | ,, |
| ప్రాణాగ్నికుమారము | 66 |
| దివ్యాగ్నికుమారము | ,, |
| ఉత్తమాగ్నికుమారము | 67 |
| భూతభైరవి | 68 |
| విజయభైరవి | ,, |
| సంగరభైరవి | 69 |
| మదనభైరవి | ,, |
| ఆనందభైరవి | 70 |
| మనోభైరవి | ,, |
| స్వచ్ఛందభైరవి | 71 |
| కల్యాణభైరవి | ,, |
| విదారుణభైరవి | 72 |
| సన్నిపాతభైరవి | ,, |

| | పుట | | పుట |
|---|---|---|---|
| కారుణ్యభైరవి | 73 | రసరాజరసము | 89 |
| సిద్ధభైరవి | 74 | కాలభైరవరసము | ,, |
| కరవాలభైరవి | ,, | సూచీముఖరసము | 90 |
| రసములు | 75 | సూచికాభరణము | ,, |
| భూతేశ్వరరసము | ,, | ప్రాణేశ్వరరసము | 92 |
| త్రిపురాంతకరసము | 76 | మృత్యుంజయరసము | ,, |
| కాలకంధరరసము | 77 | మృతోత్థాపనరసము | 93 |
| శాంభవీరసము | ,, | బ్రహ్మాస్త్రరసము | 94 |
| భద్రకాళీరసము | 78 | అఘోరాస్త్రరసము | ,, |
| భువనేశ్వరీరసము | 79 | పాశుపతాస్త్రరసము | 95 |
| ఉమామహేశ్వరీరసము | ,, | విష్ణుపరాక్రమరసము | ,, |
| విశ్వంభరరసము | 80 | ప్రళయానలరసము | ,, |
| నారసింహరసము | 81 | రోగవిదారణరసము | 96 |
| గరుడధ్వజరసము | ,, | వీరప్రతాపరసము | ,, |
| భార్గవరసము | ,, | పరంజ్యోతీరసము | 97 |
| వైష్ణవీరసము | 82 | రాజరాజేశ్వరీరసము | ,, |
| హిరణ్యగర్భరసము | ,, | కాలాగ్నిరుద్రరసము | ,, |
| నారాయణీరసము | 83 | గండభేరుండరసము | 98 |
| కమలాసనరసము | 84 | మృతసంజీవనీరసము | , |
| పితామహరసము | ,, | ధన్వంతరీరసము | ,, |
| కైటభారిరసము | 85 | ఫణిభూషణరసము | 99 |
| లక్ష్మీనారాయణరసము | ,, | రోగభంజనరసము | ,, |
| భారతీరసము | ,, | పాణిబుడారసము | ,, |
| కల్యాణరసము | 86 | ద్విమూర్తిరసము | 100 |
| శరభేశ్వరరసము | ,, | త్రిమూర్తిరసము | ,, |
| వీరవిక్రమరసము | ,, | పంచమూర్తిరసము | ,, |
| త్రివిక్రమరసము | 87 | సన్నిపాతదావానలరసము | ,, |
| విజయవిక్రమరసము | ,, | చండభానురసము | 101 |
| రసేంద్రరసము | 88 | సూర్యపావకరసము | ,, |
| మహేంద్రరసము | ,, | శీతగజాంకుశరసము | ,, |
| లోకేశ్వరరసము | ,, | నవనాథరసము | 102 |

| | పుట | | పుట |
|---|---|---|---|
| చోడసిద్ధరసము | 103 | శీతగాత్రసన్నిపాతకషాయము | 120 |
| 4. ఆశ్వాసము. | | తాంద్రికసన్నిపాత కషాయము | ,, |
| భస్మేశ్వరరసము | 105 | కంఠకుబ్జ సన్నిపాతకషాయము | ,, |
| అర్కేశ్వరరసము | ,, | కర్ణికసన్నిపాతకషాయము | ,, |
| కాళికేశ్వరరసము | 106 | భుగ్ననేత్ర సన్నిపాతకషాయము | ,, |
| నస్యయోగములు | ,, | రక్తష్ఠీవి కషాయము | 121 |
| అంజనములు | 107 | ప్రలాపసన్ని కషాయము | ,, |
| ప్రభోధాంజనము | 108 | జిహ్వకసన్నికషాయము | ,, |
| బాలసూర్యోదయము | ,, | అభిన్యాససన్నికషాయము | ,, |
| వీరభద్రాంజనము | ,, | దశమూల కషాయము | ,, |
| ప్రకాశాంజనము | 109 | పంచమూలకషాయము | 122 |
| హింగుళాంజనరసము | ,, | పంచకోల కషాయము | ,, |
| గండూషయోగములు | 110 | అష్టాదశమూలకషాయము | ,, |
| క్షేత్రపాలకధూపము | 112 | అతిసారహరకషాయములు | 124 |
| గజకేసరి | ,, | శూలలకు | 126 |
| హిక్కలకు-ఛర్దులకు | 114 | ప్రాంతవేఁకులకు | 127 |
| జ్వరములకు | ,, | శీతజ్వరకషాయము | ,, |
| వాతజ్వరహారకషాయము | ,, | అహికజ్వరకషాయము | 128 |
| పైత్యజ్వరహారకషాయము | 115 | రాత్రిజ్వరకషాయము | 129 |
| శ్లేష్మజ్వరకషాయములు | 116 | అంతర్గతజ్వరకషాయము | ,, |
| అజీర్ణమునకు కషాయము | 117 | ధాతుజ్వరకషాయము | ,, |
| సర్వజ్వరకషాయము | 118 | ధన్వంతరిధ్యానాదికము | 130 |
| సన్నిపాతములకు కషాయము | 119 | సుదర్శనమంత్రము | 133 |
| సంధికసన్నిపాత కషాయము | ,, | నస్యమంత్రము | ,, |
| అంతకసన్నిపాత కషాయము | ,, | అంజనమంత్రము | 134 |
| రుద్ధాహసన్నిపాత కషాయము | ,, | ధూపమంత్రము | ,, |
| చిత్తవిభ్రమ సన్నిపాతకషాయము | ,, | | |

శ్రీరస్తు

శ్రీ ధన్వంతరయే నమః

# వైద్యచింతామణి



సీ॥ శ్రీ జనకాత్మజాంచిత భవ్యతరవత్సు
పాకారిముఖ్య దిక్పాలరక్షు
కౌశిక మఖతోషు కౌస్తుభమణిభూషు
మహిత నిర్జరపోషు మంజుభాషు
సకల లోకాధీశు సజ్జనాథు వినాశు
రవికోటి సంకాశు రవికులేశు
ఘోరదైత్యవిదూరు నీరధి గంభీరు
నగధీరు శ్రీ భద్రినగవిహారు

గీ॥ దీనసంతాను పన్నగాధిపశయాను
భవ్యచారిత్రు పన్నగాభరణమిత్రు
రమ్య సత్కరుణాసాంద్రు రామచంద్రుఁ
జేరి ప్రణుతింతు మదభీష్ట సిద్ధికొఱకు॥

కం॥ శ్రీ నగతనయా పుత్రుని
మానిత గజవక్త్రు కనకమయ సద్గాత్రున్
భాను నిశాకర నేత్రుని
జానుగ నుతియింతు కావ్య సౌకర్యముకై

గీ॥ అశ్వినుల పూజగావించి యాదిమునుల
వినుతి జేసియు ధన్వంతరిని దలంచి
ధర భిషగ్వర్గ మధికసంతసము నంద
వైద్యశాస్త్రంబు తెనుఁగింతు వర్ణితముగ॥

క॥ కందము వెలిగా పద్యము
లందుల పాదంబులధిక మగునట్లుగనే
నందముగను జెప్పెద కవి
బృందము సంతసము నొంద పృథివిస్థలిలోన్ ॥

సీ॥ వసుధలోపల కురకుర వైద్యులెల్లఁ
బెక్కు నేర్తు మటంచును పేళ్లు పడుచు
కాక వైద్యంబు తచ్ఛాస్త్రగతికనుంగొ
నంగ నేర్తురె వట్టి పెడంగు గాని ॥

కం॥ చింతామణి యను గ్రంథము
వింతగఁ దెనుఁగున రచింతు విద్వజ్జనముల్
సంతసము నొంద జగతిని
సంతతము భిషగ్జ్ఞరాజ సంఘము మెచ్చన్ ॥

కం॥ ధీరుఁడును సుజనహితుఁడును
శూరుం డగు ధేనుకొండ జోగికి సుతుఁడన్
గారవమునఁ గేశవుఁడను
పేర నలరినాఁడ సుకవి పృథుసత్కరుణన్ ॥

షష్ఠ్యంతములు

కం శ్రీ సాకేతపురీవర
వాసునకు నిరంతర ప్రవర్ధిత విలస
ద్దాసునకు మదనకోటివి
లాసునకు హిరణ్యామంజులసువాసునకున్ ॥

కం॥ శౌరికి పటుబాణాసన
ధారికి మునిరాజభయ విదారికి లోకో
ద్ధారికి దశముఖ ముఖసం
హారికి సీతాహృదయ విహారి నృహారికిన్ ॥

కం॥ రామునకు దుష్టదనుజవి
రామున కాశ్రిత మనోభిరామునకు పరం
ధామునకు దివ్యతారక
నామోద్ధామునకు భద్రనగధా మునకున్ ॥

వ॥ సమర్పితంబుగా నా రచియింపంబూనిన వైద్య చింతామణి తెనుంగు, మున్నింద్రకంటి వల్లభార్యుఁడు చెప్పిన తెలుంగున నీ గ్రంథంబు చతురాశ్వాసంబులు చేసి ప్రథమంబున నష్టస్థాన పరీక్షయు, చతుర్విధాజీర్ణ లక్షణంబులును, సప్తజ్వరలక్షణంబులును, నాహిక జ్వరలక్షణంబులును, సప్తధాతుగత జ్వరలక్షణంబులును త్రయోదశ సన్నిపాత సాధ్యాసాధ్య దినప్రమాణ లక్షణంబులును, సప్తదోష లక్షణంబులును, పంచాతిసార లక్షణంబులును, సాధ్యాసాధ్యజ్వర లక్షణంబులును, జ్వర దినచర్యయు, జ్వర లంఘనప్రమాణంబులును, దద్విశేషంబులునుం జెప్పెద; ద్వితీయంబున—రస శుద్ధి భస్మ సిందూర గుణంబులును, మహా రసోపరస సాధారణ రస శుద్ధులును, దశలోహశుద్ధి భస్మ సిందూరగుణంబులును, నవరత్న శోధనంబులు, తచ్ఛుద్ధి భస్మ సిందూరంబు లెఱింగించెద ; తృతీయంబున—దశవిధ కుమారంబులును, త్రయోదశ భైరవంబులును, షష్టి రసౌషధములునుం జెప్పెద ; చతుర్థంబున—నస్యంబులును, అంజనంబులును, ధూపంబులును, గండూషంబులును, అతి సారౌషధంబులును, రోగానుపానంబులును, కషాయంబులును, మఱియు ధన్వంతరిధ్యానంబునుం జెప్పెద ॥

గీ॥ సర్వ రోగంబులకు నెల్లఁ జగతిలోనఁ
జూడవలయును వైద్యులు నాడి రూప
స్పర్శ మల మూత్రములు జిహ్వా శబ్ద నేత్ర
ములును నివి యష్టసంస్థానము లనఁబరగు ॥

కం॥ పురుషులకును కుడి చేయిని
తరుణులకును నెడమచేయి తగు నేర్పమరం
బరికించి చూడవలయును
సరసజ్ఞులు వైద్యశాస్త్ర సమ్మతిచేతన్ ॥

కం॥ ధమని యనామిక మందున
గమనము గలిగున్న గాడ్పు క్రమ్మఱ నడిమ
ధ్యమ శాఖఁ (వ్రేల) దగుల పైత్యము,
క్రమమున పైవ్రేలఁ దాఁకఁ గఫరోగమగున్ ॥

గీ॥ వక్రగతి గల్గియుండిన వాతనాడి
వేగమైయున్న పైత్యంబు విశదముగను
స్థిరగతియుఁ గల్గి నడిచిన శ్లేష్మనాడి
ద్వంద్వమైనను మిశ్రమై తనరు భువిని ॥

* సీ॥ రహింజలూకాహి కూర్మర్షభమ్ములను బోలి
యానంబు గల్గిన ననిలనాడి
పిక కాక లావుక భేక కపోతంబు
భాతిగ నడచిన పైత్యనాడి
కలరవ మాయూర కలభ కృకావకు
గమనంబు గల్గిన కఫజనాడి
బరువడి మాయూర బర్హావద్గమనంబు
వలె గనుపించిన వాతపైత్య

నాడి సర్పంబు రీతిని నడిచి మఱియు
హంస రీతిని నడిచిన ననిలకఫము
మాండూక ధ్వాంక్షముల రీతి మఱియు మఱియు
నడచె నేని పైత్యశ్లేష్మనాడి యండ్రు ॥

---

*నాడీపరీక్షయందు రోగియొక్క హస్తాంగుష్ఠ మూలమునుండి యనామిక మొదలుగా మూడు వ్రేళ్లనుంచి పరీక్షించిన నీ క్రమమువచ్చును. గాడ్పు = వాతము

గీ॥ కాష్ఠభారంబు మధ్యను గంధ మూష
కంబు రీతిని గమనంబు గల్గియున్న
చలితమై యున్న సూక్ష్మత గలిగియున్న
సన్ని నాడి యటంచ్రు సజ్జనులు నుర్వి ॥

గీ॥ సుప్తకాకంబు రీతిని సుస్థిరముగ
నడిచెనేనియు దీపననాడి యంద్రు
నాడి చక్రాంగమును బోలి నడిచెనేని
యవని లోపల మలబద్ధ మంచిబుధులు ॥

కం॥ నాడీజ్ఞులజీర్ణములకు
నాడిని ద్విరదంబురీతి నడచు నటంద్రుక్
క్రోడీకరించి ధాతువు
చూడుడి సద్వైద్యులార ! సుస్థిర మతిచే ॥

కం॥ చూడఁగ స్త్రీ దోషమునకు
నాడి యరిష్టంబురీతి నడచు నటంద్రున్
కోడివలె నడిచెనేసిన్
నాడియు జ్వరతీక్ష్ణమంద్రు నాడీజ్ఞు లిలన్ ॥

సీ॥ పైత్యవిభ్రమున కపస్మారికిని నతివ్యా
యామకునకు *నభ్యాసునకును
ఉపవసితునకు శైత్యోద్రేకునకు మధు
పానునకునుఁ గ్రవ్యభక్షణునకు
గాంధారి సేవికిఁ గడుదుఃఖితునకును
మన్మథోద్రేక ప్రమత్తునకును
భూతవశ్యునకును స్నాతునకు సుషుప్తు
నకు దేహశోధనునకును మిగుల

గీ॥ క్షుధితునకును తృష్ణాతపశీతునకును
నన్ను మొనరించునప్పుడు నవనిలోన

*అభ్యాసకుడు = యోగాభ్యాసి

నాడి దృశ్యం బదృశ్యమై నడచు వైద్య
శాస్త్ర సమ్మత మిది సుమ్మ జగతిలోన ॥

## స్వరూప లక్షణము

సీ॥ శ్యామల కాంతిని సరివచ్చె నేనియు
వాతప్రకోప రూపం బటండ్రు
పచ్చని కాంతిచే పచరించి యుండిన
పైత్య సంజనిత రూపం బటండ్రు
పాండుర కాంతిచేఁ బరగిన రూపంబు
కఫసంప్రభూతరోగం బటండ్రు
మిశ్రవర్ణముచేత మెఱుగొప్పియుండిన
ద్వంద్వరోగ మటండ్రు ధాత్రిలోన

మేచకచ్ఛాయ గల్గిన, మిగుల హేమ
సన్నిభంబైనఁ, దద్దయు సజలకాంతి
యైన మిశ్రక రోగంబు నసదు పసిఁడి
ఛాయ గలిగున్న కామిలజ్వర మటండ్రు ॥

## స్పర్శలక్షణము

ఉ॥ మిక్కిలి వెచ్చఁదాఁకి మఱి మిక్కిలి శీతము గల్గియుండినన్
నిక్కముగాను పైత్య *మది నిజ్వరమైనను వాతరోగమా
తక్కువగాను వేఁకి మెయి దాకిన శ్లేష్మము తద్విశేషముల్
మిక్కిలి యయ్యెనేని నది మిశ్రకరోగ మటండ్రు భూస్థలిన్

## మల పరీక్ష

సీ॥ బద్ధమై కపిలమై బహు నల్లనైయున్న
విట్సమీర మటండ్రు విశదముగను
నరుణ సన్నిభమునై హారిత వర్ణంబునై
తనరిన పైత్యసంజనిత మండ్రు
తెల్లనై సైకము నల్లనై ఫేనము
గలిగుండెనేనియు కఫ మటండ్రు

---

*నిజ్వరము = వేడి తక్కువయైన. కఫమునందు శైత్యాధిక్యముండును. వాతాధిక్యమున శైత్యము రూక్షగుణయుక్తము, కఫాధిక్యమున స్నిగ్ధగుణయుక్తము.

మేచకచ్ఛాయమై మిగుల దుర్గంధమై
పీతమైనను సన్నిపాత మంద్రు

సజలమై యున్న నుష్ణాతి సారమంద్రు
తైలవర్ణంబురీతిని దనరియున్న
మానవునకును ఋగ్బాధ మాన్పుటకును
నశ్వినులకు ధన్వంతరికైన దరమె ॥

మూత్ర పరీక్ష

సలలిసమానమై మిగుల జారిన మూత్రము వాతరోగమా
మలతి ? హారిద్రవర్ణ మది మానుగ పైత్యము రక్తవర్ణమున్
గలిగిన తద్దయుగ్ర పసపుకాంతిగ నుండిన సన్నిపాత మా
తెలుపగు నేని శ్లేష్మమది ధీమతులార! యెఱుంగు డెన్నడున్

జిహ్వా పరీక్ష

* సీ॥ అనిల సంభూతంబు నైన జిహ్వాగ్రము
కఠినమై పచ్చనై కంటకమగు
జ్వర కర్తృకమునకు నరుణవర్ణంబునై
శ్యామల కాంతిని సమమువచ్చు
శ్లేష్మంబునకు నతి శ్వేతమై తనరారు
ద్వంద్వంబునకు మిశ్ర మొందు కాంతి
శ్యామమై కంటక సంయుక్త మగు నేని
సన్నిపాత మటంద్రు జగతిలోన

వగరు గలిగున్న ద్రవ మది వాతమంద్రు
చేదు గలిగున్న పైత్యంబు స్వాదువైన
కఫ సముద్భూత మది యతికటుకషాయ
సంయుతంబైన సంకరజాతి యంద్రు ॥

---

*జ్వరకర్త = పిత్తము

## శబ్ద పరీక్ష

కం॥ మిత భాషియైన వాతము
నతి భాషణుఁడైన వహ్ని యవనీస్థలిలో
మతి మందమైన శ్లేష్మము
మతి చలనంబైన సన్ని మది తెలియంగన్

## నేత్ర పరీక్ష

సీ॥ శ్యామమ్ములైకనుల్ జలము స్రవింపుచు
నసదు శూలించిన నదియు గాడ్పు
గార సన్నిభములై కలిగిన కన్నులు
వహ్ని సంభవ మండ్రు వసుధలోన
కన్నుల యందునుఁ గడు తెల్లనై శూల
గలిగుండెనేనియు కఫ మటండ్రు
పచ్చని కాంతిని నెచ్చరించిన నతి
సజల వర్ణంబైన సన్నియండ్రు

వక్ర దృష్టియైన వాతంబు నుష్మల
గతిని నుండెనేని కఫమటండ్రు
చపల దృష్టియైన జ్వరకర్త యదియండ్రు
నూర్ధ్వ దృష్టియైన నుండ డుర్వి॥

వ॥ ఇంక అజీర్ణ లక్షణం బెఱింగించెద

## అజీర్ణ భేదములు : లక్షణములు

* సీ॥ ధూమ, విస్ఫ్రుష్ట, విధూమ రస శేషము
లనఁగ నాలుగు సంజ్ఞలలరు భువిని
ధూమంబు నదనది ధూపంబు గల్గియు
గంధస్వభావంబు గల్గియుండు
విస్ఫ్రుష్ట మనునది వికలమై దేహంబు
తాపంబు నొందు పాదద్వయంబు

---

*అజీర్ణములు 6 విధములని యితర గ్రంథములందు గలదు. అవి వాతమువలన విష్టబ్ధాజీర్ణము, పిత్తమువలన విదగ్ధాజీర్ణము, కఫమువలన ఆమాజీర్ణము, మరియు రసశేషాజీర్ణము, దినపాకి - అజీర్ణము, ప్రాకృతాజీర్ణములని యారువిధములు.

నలసట గల్గియు నాస్ల ముద్గారంబు
నధిక మైన విధూమ మనఁగబరగు

శిరము నాద్యంత మధికంబు బరువుపడిన
నధిక నిష్ఠీవమై యున్న నలఁత మైన
నాస్లగంధంబు గల్గిన నవనిలోన
నదియు రసశేష మని యంద్రు రార్యవరులు॥

## జ్వరభేదములు : లక్షణములు

వ॥ ఇంకను జ్వరభేదంబు లెఱింగించెద

గీ॥ వామదేవుఁడు మున్ను కోపానలమున
నిటల నయనంబు తెఱచిన నిముషమునను
దక్షుయజ్ఞంబు దగ్ధమై తత్క్షణమున
సర్వజన బాధ కమ్మగు జ్వరముబుట్టె॥

కం॥ వాతధనంజయములు, నభి
ఘాతా జీర్ణములు, ద్వంద్వ కఫజోష్ణమ్ముల్
భూతజ్వరమును నాదిగ
భూతలమున నేడు నుష్ణములు విలసిల్లున్॥

## వాతజ్వర లక్షణములు

ఉ॥ ఊరులు నంఘ్రిమూలము కపోలము మూర్ధముఁ
బాణి, కంఠమున్
భారము గల్గియున్న మలబద్ధమునైన విజృంభణంబులున్
సారెకుఁ గల్గి నన్ముఖము శ్యామలమై యతిశీతలంబునైఁ
బూరితమైన ఫాలము కపోలములం దధికోష్ణ ముండెనా
నోరు కషాయమైన పలు నొప్పులు గల్గిన ధాత్రిలోపలన్
మారుతరోగ మంచునది మానవులార యెఱుంగు డెప్పుడున్॥

---

అసదు = అల్పముగా

జ్వరకర్త = పిత్తము

జ్వరములు, వాతజ పిత్తజ కఫజ (8) ద్వంద్వజ సన్నిపాతజాగంతుకములను
నెనిమిది విధములని యితరవైద్య గ్రంథములు

## పైత్యజ్వర లక్షణములు

అతిసారం బతినిద్ర గల్గియును దేహాద్యంతముఁ తాపము
న్నతిస్వేదం బగు పాదహస్తతలమున్ నాసాగళంబుష్ణమౌ,
మతి చాంచల్యము ఛర్ది హిక్క యరుచిఁ మైమంటలుఁ
మూర్ఛయున్
భ్రతి తోద్గారము, దాహముఁ గలిగినఁ, బైత్యజ్వరం
బండ్రిలఁ ॥

## శ్లేష్మజ్వర లక్షణములు

భూరిశరీరశీతలము పూరితమై ముఖకాంతి తెల్లనై
సారెకు శ్వాసకాసయును ఛర్దియు, పీనస, హిక్క, గల్గి గం
భీరము లాడిన స్మనము భీతిగ నుండిన తంద్ర గల్గినఁ
ధారుణిలోన శ్లేష్మ మది తథ్యము సద్గుణులార చూడగఁ ॥

## వాతపిత్తజ్వర లక్షణములు

గీ॥ అంగవైకల్యమై యున్న నధికనిద్ర
గల్గి యున్నను మిక్కిలి కాసయైన
శ్వాసరోమాంచమై యున్న ఛర్దియైన
వాతపిత్త జ్వరం బండ్రు వసుధలోన ॥

## వాతకఫజ్వర లక్షణములు

గీ॥ పర్వములయందు మూర్ధ కపాలములను
శూల గలిగున్న మిక్కిలి శోషయైన
చెమట మోమున గలిగున్న భ్రమసియున్న
వాతకఫ జోష్ణమని యండ్రు వైద్యవిదులు ॥

## పిత్తకఫజ్వర లక్షణములు

గీ॥ వక్త్ర తిక్తము గలిగున్న వాంతియున్న
శ్వాసయై యున్న మిగుల పిపాసయైన

శీతమైయున్న నరుచైన స్వేదమైన
పిత్తకఫజోష్ణ మని యండ్రు పృథివిలోన ॥

10 98

## భూతజ్వర లక్షణములు

కం॥ శీతంబై మతి యుష్ణో
పేతంబై నృత్య మాస్య మెఱుపయి వికృతా
పాతంబై చూచుట యది
భూతజ్వర మండ్రు బుధులు భూతల మందున్ ॥

వ॥ మఱియు,

కం॥ మే నెఱుగ కుండు టేడ్చుట
జానుగ నృత్యప్రలాప సంగీతంబుల్
మానక సల్పుట పై శా —
చానూన జ్వరమండ్రు నరుల కవనీస్థలిలో ॥

## అజీర్ణ జ్వర లక్షణములు

కం॥ ఊరులు నొచ్చిన నత్యు
ద్గారము గలిగున్న వహ్ని తక్కువయైనన్
సారెకు హిక్కలు గల్గిన
సార చికిత్సకులజీర్ణజజ్వరమండ్రున్

## అభిఘాత జ్వరలక్షణములు

గీ॥ భార మధికంబు మోసిన దూర యాత్ర
నరిగినను నది యభిఘాత మనెడు నుష్ణ
మదియు నధికమ్ము భోజ్యక్షుదపమ్ము గల్గు
దేహవైకల్యమై యుండు తివిరి తాప
మగ్గలంబగు శైత్యంబు నధికమగుచు
నదియు తెలియుడి వైద్య శాస్త్రానుసరణి ॥

## ఆహ్నికజ్వరభేద, లక్షణములు

* సీ॥ ఏకవారంబున వేంకి, దాకిననది
యాహ్నికంబనఁ జెల్లు నాహ్వయంబు
మిథునంబునను మఱి మేను వెచ్చగ నున్న
నది ద్వితీయాహ్నిక మతిశయిల్లు
త్రిదినంబు నందున దేహముష్ణంబైన
నదియుఁ ద్ర్యాహ్నిక మన నవని బరగు
చాతుర్థ దినమందు జ్వరము గలిగెనేని
చాతుర్థికం బండ్రు సరణి వెచ్చ

పంచకమునఁ దగుల పంచాహ్నికంబగు
సప్తమమున గలుగ సప్తరాత్ర
జ్వరమటంచు బరగు జగతిలో వేర్వేఱ
వింటె తద్గుణములు విస్తరింతు ॥

* సీ॥ దేహ మాద్యంతంబు తిమిరి గల్గి జ్వరంబు
వెండియు మేనఁ గన్పించెనేని
శ్వాసమ్ములుఁ దృష్ణపిపాసాంగ తాపముల్
కలిగిన నదియాహ్నిక మనఁబరగు
కన్నులందు జలంబు కడు స్రవింపుచునున్న
శిరమున మేనున బరువుదోప
సంతాపమును బహిశ్శైత్యంబు గలిగున్న
నవి ద్వితీయాహ్నిక మనఁగనొప్పు
నరుచి గలిగున్న మలబద్ధమైన స్వేద
మధికమైయున్న నదియు నుఁద్ర్యాహ్నికంబు
మూత్రనఖచర్మ మల నేత్రములును హారిత
కాంతి గలిగున్న చాతుర్థిక జ్వరంబు ॥

---

*మిథునము దినద్వయము

*ఆహ్నిక జ్వరములకు విషమజ్వరములని పూర్వగ్రంథకర్తలు. అవి సతతము, సంతతము, అన్యేద్యుష్కము, తృతీయకము చాతుర్థికము అనునవి. ఇవిగాక తృతీయక విపర్యయము, చాతుర్థికవిపర్యయములును విషమజ్వరములే. వాతబలాసకజ్వరము, ప్రలేపకజ్వరములను నీ రెండును విషమజ్వరములేయనిరి.

సీ॥ చలువ దాకియు నొడల్ పులకరించియు వెచ్చ
తాకి, కాసయు గల్గి దప్పిమైన
పంచాహికంబగు పాదముల్ హృదయము
కనులు మోహము శోఫ గలిగియున్న
నమిత భోజ్యంబు ప్రియంబైన వణకైన
పార్శ్వముల్ శిరమును భారమైన
నుదరంబునను శూల యున్నను నదియును
నష్టరాత్రజ్వరం బనగబరగు

నయన నఖములు రక్తహీనమ్ములైన,
గ్రహణి గలిగున్న పాండుర కాంతిమైన
హస్త పాదము లతిదాహ మంటియున్న
పక్షమాస జ్వరం బండ్రు భవ్యమతులు ॥

వ॥ ఇంక సప్తధాతు గతజ్వర లక్షణం బెఱింగించెద.

రసధాతుగత జ్వరలక్షణములు

మఱి మఱి వెచ్చతాకి యినుమారును శీతము కల్గినంతలో
శిరమున శూల గల్గియును స్వేదము రోచక మాతిసారమున్
జనువడిగల్గియు న్నొడలు భారము గల్గి కృశత్వ మొందినన్
ధరణిని నెన్న గాను రసధాతుగతజ్వర మండ్రు సద్గుణుల్ ॥

త్వగ్గతజ్వరము*

గీ॥ ఒడల వేడికి గల్గి యురుదాహమును గల్గి
నాడి మందగతిని నడిచి నొప్పి
యించుకంత శిరము నిరుపార్శ్వములయందు
గల్గియున్న చర్మగత మటండ్రు ॥

రక్తధాతుగతజ్వర లక్షణములు

కం॥ అతిసారము గలిగుండిన
నతివెచ్చన గలిగి మేన నలసటమైనన్
మతి లేకుండుట లోహిత
గత మండ్రిది వైద్యశాస్త్రకారకు లవనిన్ ॥

---

*త్వగ్గతజ్వరము రసధాతుగత జ్వరమునందె యంతర్భూతము

### మాంసధాతు గతజ్వర లక్షణములు

కం॥ జ్వరమును స్వేదము మూర్ఛయు
గరు వొడుచుట తంద్ర, మూర్ఛ, కాస, కలిమియగా
బరువడి దేహము నొచ్చుట
సరసజ్ఞులు మాంసగతము, జ్వరమంద్రు భువిన్ ॥

### మేదోధాతు గతజ్వర లక్షణములు

గీ॥ చిత్త వికలమైన శిరము శూలించిన
శోషమైనఁ గుక్షిశూల మైన
నాడి సూక్ష్మముగను నడచిన మేదోగ
తజ్వరం బటంద్రు ధాత్రిలోన ॥

### అస్థిధాతు గతజ్వర లక్షణములు

గీ॥ ఒడలు నెండబారి కడు తెల్లనైయున్న
ననవరతము వేకి యంటియున్న
నగ్గలముగ దేహమందు తాపంబైన
కంపమైన నస్థిగత మటంద్రు ॥

### మజ్జాధాతు గతజ్వర లక్షణములు

గీ॥ ముఖ సరోజము వడలిన మూర్ఛ గ్రహణి
గలిగియున్నను చిత్తంబు చలనమైన
మలవిబద్ధము గలిగున్న నలత వేకి
తనరి యున్నను మజ్జాగతం బటంద్రు ॥

### శుక్రధాతు గతజ్వర లక్షణములు

గీ॥ వీర్య పతనంబు గలిగి స్రవింపుచున్న
పాదహస్తము సూక్ష్మము బరగియున్న
నరుచి గలిగున్న దాహంబు నధికమైన
శుక్లగత మంద్రు భువిలోన సుమతు లెపుడు ॥

## సన్నిపాతజ్వర లక్షణములు

వ॥ ఇంక సన్నిపాతలక్షణం బెఱింగించెద

సీ॥ నేత్రముల్ తను మల మూత్రముల్ నఖములు
పచ్చని డాలున హెచ్చియున్న
నుదుట వక్షంబునను గళంబునను మఱి
చరణపాణులయందు చెమటదైన
పర్వంబులను పక్ష పార్శ్వంబులను మూర్థ
తలమున శూలయుఁ దనరియున్న
హాస్యగీతప్రలాపానృత తంద్రతృట్
కాసరోమాంచముల్ గలిగియున్న

మూర్ఛ గలిగున్న జిహ్వను ముల్లుదాకి
నల్లనై యున్న ధాతువు నలికమైన
కాన బడకున్న నస్థిరమైన నదియు
సన్నిపాత జ్వరం బండ్రు సరసులెపుడు ॥

వ॥ మఱియును సంధికంబును, హంతకంబును, రుగ్దాహంబును, చిత్తవిభ్రమంబును, శీతాంగంబును, తాంద్రికంబును, కంఠకుబ్జకంబును, కర్ణికంబును, భుగ్ననేత్రంబును, రక్తష్ఠీకంబును, ప్రలాపంబును, జిహ్వకంబును, అభిన్యాసంబును, నను త్రయోదశ సన్నిపాత లక్షణంబులవే ర్వేఱ నెఱింగించెద.

## సన్నిపాతజ్వర సాధ్యాసాధ్య లక్షణములు

గీ॥ ధాత్రిలోపల సంధిక తాంద్రికములు
చిత్తవిభ్రమ కర్ణిక జిహ్వకాప్ర
లాపములు నివి యాఱు సాధ్యంబు లండ్రు
హంతకంబును మఱి యభిన్యాసకమును
కంఠకుబ్జము రుగ్దాహకమును భుగ్న

చక్షు రక్తేష్టి శీతాంగ సన్నిపాత
ములు నసాధ్యంబు లివి యేడు ముఖ్యముగను
తెలిసి వైద్యంబు జేయఁగ వలయుజుమ్ము ॥

సంధిక సన్నిపాతజ్వర లక్షణములు

కం॥ రూపం బెప్పటి వలెనై
ధూపంబై నొడలునొచ్చి తోట్రిలిపడుచున్
దాపము గల్గియు కఫముప్ర
కోపంబగునేని సంధికుంభిని లోనన్ ॥

హాంతక సన్నిపాతజ్వర లక్షణములు

కం॥ నిబ్బరము లేక వణకుట
దబ్బర లాడుటయు హిక్క తాపం బగుటన్
గొబ్బున ఛర్దియు గలుగుట
నబ్బురముగఁ ద్రుంచు హాంతకాహ్వయము భువిన్ ॥

రుగ్దాహ సన్నిపాతజ్వర లక్షణములు

కం॥ నుదుటను కంఠమునందును
నొదవిన స్వేదమును మిగుల నుచ్ఛ్వాసంబున్
వదనము వాడుట పేలుట
హృదయంబున వ్యథయునుండు బు(రు)గ్దాహమున్ ॥

చిత్తవిభ్రమ సన్నిపాతజ్వర లక్షణములు

గీ॥ వాత పిత్తప్రకోపమై గీత, నృత్య
హాస్యములు భ్రూవికారము నలత, దేహ
తాపమును గల్గియుండిన ధరణిలోన
చిత్తవిభ్రమ మనియండ్రు సిద్ధముఁగను ॥

శీతాంగ సన్నిపాతజ్వర లక్షణములు

కం॥ మిక్కిలి శీతము తాపము
వెక్కులు నతిసార మూర్ఛ, వేదన, శ్వాసల్

చిక్కిన నది శీతాంగము
గ్రక్కున తద్రోగి జనుని కడకుం బోవున్ ॥

తాంద్రిక సన్నిపాతజ్వర లక్షణములు

గీ॥ తంద్ర గలిగున్న మిక్కిలి దాహమైన
దృష్టి విస్మితమై యున్న తీవ్రముగను
నుష్ణమైయున్న నలసట యుబ్బసమును
తాప మతిసారములు గల్గ తాంద్రికంబు ॥

కంఠకుబ్జ సన్నిపాతజ్వర లక్షణములు

ఉ॥ పెక్కు విధంబు లౌను టతివేదన గల్గుట మూర్ఛ నొందుటల్ ॥
వెక్కులు దేహతాపమును వేకియు మూర్ధము కంప మొందుటల్ ॥
దిక్కులు చూచి పై నులికి దిగ్గున లేచుట కంఠకుబ్జహా
నిక్కము రోగినిద్ది పెనునిద్దుర పుచ్చక యున్న ధారుణిన్ ॥

కర్ణికసన్నిపాత జ్వరలక్షణములు

గీ॥ కంపరంబైన కాసయుఁ గల్గియున్న
జిహ్వ కంటకమై యున్న చిత్రముగను
కర్ణములక్రింద శోఫయుఁ గల్గియున్న
కర్ణిక మటంద్రు భువిలోన నిర్ణయముగ ॥

భగ్ననేత్ర సన్నిపాతజ్వర లక్షణములు

గీ॥ భుగ్ననేత్రములై కను పొదలిబొప్ప
జలము లోల్కమై వణఁకినఁ జలువయైనఁ
బ్రమసినను శ్వాసయైనను భగ్ననేత్ర
మనఁగఁజెల్లును దీనిని నణఁపవశమె ॥

---

త్రయోదశ సన్నిపాతములలో నొకటియగు భుగ్ననేత్ర సన్నిపాతమునకీ గ్రంథమున భగ్ననేత్రమని వాడఁబడినది

### ప్రలాప సన్నిపాతజ్వర లక్షణములు

గీ॥ ఒడలు నొచ్చిన కాసయుఁ బొడమియున్న
జ్వరము గలిగున్న మిక్కిలి శ్వాసమైన
కాయ మధికంబు వణఁకిన కల్లమాట
లాడినను భువిని ప్రలాప మనగఁబరగు ॥

### రక్తష్ఠీవి సన్నిపాతజ్వర లక్షణములు

చ॥ అధరమునందు జిహ్వ మొదలందును స్ఫోటముగల్గి తద్దయుం
రుధిరము గారెనన్ వణఁకు రోషము మూర్ఛయు హిక్క కాసలు
న్నధికము తాపము న్నలఁత యగ్గలమై తృషగల్గియుండినన్
బృథివిని లోహితేష్ఠి యని వృద్ధచికిత్సకు లందు రెప్పుడున్

### జిహ్వక సన్నిపాతజ్వర లక్షణములు

గీ॥ అధికమగు శ్వాస మూకత బధిరతయును
గలిగి యుండిన నాలుక కఠినమైన
కంటకంబైన శ్యామల కాంతియైన
నదియు జిహ్వకమని యందు రార్యవరులు ॥

### అభిన్యాస సన్నిపాతజ్వర లక్షణములు

గీ॥ తాప మధికంబు గల్గిన దాహమైన
కఫము పైత్యము వాత సంఘటితమైన
అంగవైకల్యమై యున్న నలతనిద్ర
శైత్యమున్న నభిన్యాస సన్నియండ్రు ॥

### సన్నిపాతజ్వర దినప్రమాణము

సీ॥ సంధికంబునకును సప్తమం బంతక
సన్నికి పది దివసంబు లమరు

చక్కగా రుగ్దాహసన్నికి నిరువది
విభ్రమంబున కేకవింశతియును
సిద్ధంబు పదియేను శీతాంగములకును
తాంద్రికంబునకును దనరుపంచ
వింశతి యనగను విశదంబుగా మఱి
సప్తవారంబులు సరవి నమరు
కంఠకుబ్జమునకు గట్టిగా పదుమూడు
కర్ణికంబునకును నిర్ణయముగ
మూడు మాసంబులు ముఖ్యంబుగా నొప్పు
భగ్ననేత్రం బష్టవాసరములు
దశదినంబులు రక్తేష్టి దనరుచుండు
ప్రలపితమునకును పదునాల్గు పదియునాఱు
సరవి జిహ్వాకభిన్న్యాస సన్నిపాత
ములకు పదియేను దినములు ముఖ్యముగను ॥

వ॥ ఇఁక సప్తదోషజ్వరలక్షణముల నెఱింగించెద.

కం॥ ధరణిని సప్త విధములన
బరగును దోషములు నవియు వాక్రొప్ఫెషమతో
విరచింతు వైద్యశాస్త్రము
వరుసను భువిలోన వైద్యవర్గము మెచ్చన్ ॥

మ॥ స్త్రీలతో రతికేళి సల్పుట, చింత నొందుచు నుంటయుఁన్,
తూలి శయ్యను నత్తమిల్లుట, తోపువల్వ ధరించుటల్,
గాలి తద్దయు సోకి యుండుట, కామ్యమైన సుభోజ్యముల్
పాలు, క్షౌద్ర కిలాట శార్కర పాయసంబులు తక్రముల్
గ్రోలుటయు, మృగనాభి, చందన కుంకుమాద్యను లేపముల్
తైలమాజ్యము తమ్మలంబును తాళవృంత సమీరమున్
చాల పథ్యేతరములగుటను స్వాదుజలములు గ్రోవ్వివల్
మేలివల్లను నుజ్జగించుట మేదినిన్ జ్వరబాధితుల్ ॥

సీ॥ చలచిత్తుఁడై మత్తుచెలగుచునుండఁ బూఁ
బోఁడితోఁడుత రతిక్రీడసల్పి
నందుల సంభవం బొందు సంగమదోష
మనెడి యుష్ణజ్వర మవనిలోన
విభ్రమంబైనను విషమ దోషంబగు
శీతమైన విషము శీతమంద్రు
కృష్ణ వర్ణంబైన కృష్ణజిహ్వాక మంద్రు
రక్తవర్ణంబైన రక్తజిహ్వ
పీతవర్ణంబు గల్గిన పీతజిహ్వ
భక్ష్యములు భుజింపనగు నపథ్యదోష
సంభవం బిక సప్తదోషము లనంగఁ
బరగు నివి మీఁద వివరింతు సరసముగను ॥

కం॥ ఉరుతరతాపము గలిగియుఁ
బరువడి దాహంబు గల్గి భ్రమగలిగున్నన్
మఱి మఱి చెమటయు మేనున
విరివిగ పట్టినను నదియు విషదోషమగున్ ॥

కం॥ అంగము వణఁకుట ప్రేలుట
నింగికి నీక్షించికొనుట నిజముగనిది స్త్రీ
సంగమ మనియెఱి నుష్ణము
పొంగఁణచును జనుని రెండు పూటలకు భువిన్ ॥

కం॥ క్షణమున శీతంబై తత్
క్షణమున నుష్ణమును జిహ్వ కంటక మగుచున్
క్షణమున తాపమ్మగుచును
క్షణమున నుబ్బణచు విషమశైత్యం బవనిన్ ॥

సీ॥ కంటకంబై యతి కఠినమై నాలుక
తోపవు వర్ణము గల్గి ద్రవములేక

దాహంబునై యుష్ణతాపంబు గలిగున్న
రక్తజిహ్వాకమంద్రు యుక్తముగను
కఠినమై పీతమై కంటకంబై జిహ్వ
కాసయైనను మూర్ఛ గలిగియున్న

శీతోష్ణమైయున్న స్వేదంబు గలిగున్న
పీతజిహ్వాక మంద్రు భూతలమున
దేహంబు మిక్కిలి తీటయై దాహమై
మందమై యున్నను మఱియు చెమట

గలిగియున్నను జిహ్వ కఠినమై నలుపైన
జిహ్వాకృష్ణక మంద్రు సిద్ధముగను

తంద్రగలిగున్న మిక్కిలి దాహమైన
భ్రమసినను మఱి విప్రలాపంబులైన
హృదయ వేదన గలిగున్న నెల్లపుడును
తొట్రు పడియున్నను నపథ్య దోషమంద్రు ॥

కం॥ హరిహరు లడ్డము వచ్చిన
పరమేష్ఠిదె యనుచు మాన్పవచ్చిన *దోష
జ్వరసప్తంబులు మనుజుల
హరియించు సదా పదేను నైదిట నవని ॥

వ॥ ఇంక నతిసారంబులకు లక్షణం బెఱింగించెద

అతిసార నిదానము

కం॥ మిక్కిలి పృథుకలు నమలిన
వెక్కసముగ నుష్ణతిక్త పిణ్యాకంబుల్
మెక్కిన తద్దయు నడచిన
గ్రక్కున నతిసారరుజలు కడుసంభవమౌ ॥

---

పృథుకములు = అటుకులు. *దోషగుణమని యీ జ్వరములకు, ఆంధ్రదేశమున ప్రతీతి.

## వాతాతి సారము

ఉ॥ పొక్కిలి క్రిందనొచ్చి కడుపుబ్బుచు త్రేనుపు వచ్చినంతలో
గ్రక్కును వచ్చుచున్ మలము కార్ష్ణ్యయుతంబగు మృత్స్న
రీతిగన్
మిక్కిలి వెల్లినన్ మఱియు మేచకవర్ణము గల్గియుండినన్
ప్రక్కలు నొచ్చిన న్ననిల ప్రాభవమౌ నతిసారమౌ భువిన్॥

## పిత్తాతి సారము

గీ॥ అరుణవర్ణంబు గలిగిన మఱియు హారిత
కాంతియైయున్న ఫేనంబు గల్గియున్న
భ్రమవిదాహంబు నృచ్ఛాల, చెమట, మూర్ఛ
యైన పైత్త్యాతిసారమౌ ననిరి బుధులు॥

## శ్లేష్మాతి సారము

గీ॥ ఉదరమున శూలమై యున్న నుబ్బసంబు
నైన నిష్ఠీవమై యున్న నామమైన
మలము పాండురమై యున్న మందమైన
నదియు శ్లేష్మాతిసారమటంద్రు బుధులు॥

## ఉష్ణ (రక్త) అతి సారము

గీ॥ ఆమమైనను రక్తమునైన బడుట
పూతిగంధంబు గల్గుట భూరితాప
ముష్ణమును గల్గియుండుట యులికిపడుట
జగతిలోపల నుష్ణాతిసార మదియు॥

## సంసర్గాతి సారము

కం॥ బొంకుట దగ్గుట వణకుట
బంకపడుట రక్తమగుట వాసన యగుటన్
శంకర మదు నతిసారము
పొంకము చెడి యతడు జముని ప్రోలికి నరుగున్॥

## అసాధ్య లక్షణములు

గీ॥ మధుసమానము గలిగున్న మాంసకాంతి
నై పురీషము దుర్గంధమైన తైల
సన్నిభంబైన మిక్కిలి శ్యామమైన
సందియము తోచు దివి చికిత్సకులకైన ॥

కం॥ గుణినిక యోగముచే దు
ర్గుణము ఘటించనేని గుణముఁ దెచ్చున్
గుణహీనమైన ధాతువు
గుణముండిన రోగులకును గుణముకు వచ్చున్

గీ॥ పరభృతస్వరమై యున్న వదనమింపు
కాంతి గలిగున్న తొవబోలి కన్నులున్న
దంతములు కుందభాసమై తనరురోగి
నెపుడు నహిచేత గఱపింప నేమి భయము ॥

సీ॥ చరణహస్తంబులు జ్వరము సోకిన మఱి
జిహ్వ యందు ద్రవంబు జెందియున్న
నన్నంబుపై వాంఛ యధికంబు గలిగున్న
గంధసంజాతమాఘ్రాణమైన
సమధాతువై యున్న సౌఖ్యంబుగా నిద్ర
గలిగున్న శిరమున కండువైన
లఘుతరంబుగను దా, రక్తంబు నఖరేఖఁ
గన్నులయందుల గలిగియున్న

భోజన మొనర్చునప్పుడు వేగిరముగ
చెమట మోమున గలిగున్న విపులదృష్టి
యైన గళమున శ్లేష్మంబు హీనమైన
జ్వరమునకు మంచివి యటంద్రు జగతిలోన ॥

గీ॥ ముగురు మూర్తులు నేకమై మొనసియున్న
నదియు సంవర్త మనయంత్రము నట్లు భువిని
మూఁడు దోషంబు లేకమై మొనసియున్న
మానవునకును ప్రళయాంత మానదెందు ॥

కం॥ కజ్జలమురీతి వమనము
సజ్జనితంబైన ధూమసన్నిభమైనన్
రజ్జువువలె తెగకుండిన
వాజ్జులు తద్రోగినపుడు విడువగ వలయున్ ॥

గీ॥ కొండగుహా ప్రాంతములయందు కూపమందు
బిలమునందును దేవుని నిలయములను
హా యనుచు బిలువ మఱియు నోహా యటంచు
లేక యుండిన కాలుని లోకమరుగు ॥

కం॥ నలుదిక్కులు వీక్షించుట
పలువురితో మఱియు మఱియు బహుభాషణముల్
సలుపుట యంతట శోషయు
గలిగిన మనుజుండు జముని కడకున్ జరుగున్ ॥

వ॥ గ్రంథాంతరమున

గీ॥ విశ్వమందు రోగి వేమారు జూచిన
సంధ్యలందు దగ్గు సల్పెనేని
ముక్కు చల్లనైన మునిపండ్లు నల్లనై
యుండెనేని రోగి యుండడింక ॥

కం॥ దిగ్గున లేచి పరుండిన,
నగ్గలముగ మేనచెమట యంతట పట్టన్
అగ్గలముగ మాటాడిన
దిగ్గన సమవర్తి సన్నిధికి నతఁడేఁగున్ ॥

సీ॥ వక్షఁబునను పాదపాణుల నాసిక
చెవ్రల నుం దధికంబు శీతమైన
జ్వరతీక్ష్ణమై మఱి చలువ దాఁకెనయేని
కనులు గోరులు హరితాక్రాంతియైన
కజ్జల బుఁ గాంతి గలిగున్న గంభీర
హిక్కయైనను శ్వాస యెక్కువైన
దంష్ట్రాధరము జిహ్వ తద్దయు నలుపైన
కఫము కంఠమున సంఘటితమైన
సద్దర్శనుండైన స్వరహీనుఁడై యున్న
భ్రూవికారంబైన బుద్ధిచెడిన
కంఠనాసంబున కను స్వేదమైయున్న
వైకల్యమై ధనుర్వాతమైన
వదనంబు లోహితవర్ణంబు గలిగిన
మలము పిశితము సమానమైన
పవలు శీతమైన బరువడి రాత్రుల
తాపమైన మూర్ఛ దనరియున్న
నాడి సూక్ష్మముగను నడచిన భువిలోన
మాన వనిరి రుజలు మానవునకు ॥

వ॥ ఇంక జ్వర దినచర్య నెఱింగించెద

సీ॥ అవనిలోపల వైద్యు ననుమతి వొప్పగ
జ్వరితుఁడు దినచర్య సలుపవలయు
పూర్వంబునను దంతములు ద్రోమి తద్దయు
నరుచి హారంబుగా నపుడు వేగ
నుష్ణోదకము చేత నిష్ఠీవనము చేసి
మితముగ మోము క్షాళిత మొనర్చి
మూర్ధంబునను వస్త్రముచు గట్టి సేర్పుగా
వామభాగంబునఁ బవ్వళించి

గీ॥ ముగురు మూర్తులు నేకమై మొనసియున్న
నదియు సంవర్త మనియంద్రు నట్లు భువిని
మూఁడు దోషంబు లేకమై మొనసియున్న
మానవునకును ప్రళయాంత మానదెందు ॥

కం॥ కజ్జలముఁ బోలి వమనము
సజ్జనితంబైన ధూమసన్నిభమైనన్
రజ్జువువలె తెగకుండిన
వెజ్జులు తద్రోగినపుడు విడువగ వలయున్ ॥

గీ॥ కొండగుహా ప్రాంతములయందు కూపమందు
బిలమునందును దేవుని నిలయములను
హా యనుచు బిలువ మఱియు నోహోయటంచు
లేక యుండిన కాలుని లోకమరుగు ॥

కం॥ నలుదిక్కులు వీక్షించుట
పలువురితో మఱియు మఱియు బహుభాషణముల్
సలుపుట యంతట శోషయు
గలిగిన మనుజుండు జముని కడకున్ జరుగున్ ॥

వ॥ గ్రంథాంతరమున

గీ॥ విశ్వమందు రోగి వేమారు జూచిన
సంధ్యలందు దగ్గు సల్పెనేని
ముక్కు చల్లనైన మునిపండ్లు నల్లనై
యుండెనేని రోగి యుండడింక ॥

కం॥ దిగ్గున లేచి పరుండిన,
నగ్గలముగ మేనచెమట యంతట పట్టన్
అగ్గలముగ మాటాడిన
దిగ్గన సమవర్తి సన్నిధికి నతఁడేగున్ ॥

సీ॥ వక్షంబునను పాదపాణుల నాసిక
చెవ్వుల నుం దధికంబు శీతమైన
జ్వరతీక్ష్ణమై మఱి చలువ దాఁకెనయేని
కనులు గోరులు హారితకాంతియైన
కజ్జలబుఁగ వాంతి గలిగున్న గంభీర
హిక్కయైనను శ్వాస యెక్కువైన
దంష్ట్రాధరము జిహ్వ తద్దయు నలుపైన
కఫము కంఠమున సంఘటితమైన
సద్దర్శుచుండైన స్వరహీనుఁడై యున్న
భ్రూవికారంబైన బుద్ధిచెడిన
కంఠనాసంబున కఫు స్వేదమై యున్న
వైకల్యమై ధనుర్వాతమైన
వదనంబు లోహితవర్ణంబు గలిగిన
మలము పిశితము సమానమైన
పవలు శీతమైన బహువడి రాత్రుల
తాపమైన మూర్ఛ దనరియున్న
నాడి సూక్ష్మముగను నడచిన భువిలోన
మాన వనిరి రుజలు మానవునకు ॥

వ॥ ఇంక జ్వర దినచర్య నెఱింగించెద

సీ॥ అవనిలోపలవైద్యు ననుమతి వొప్పున
జ్వరితుండు దినచర్య సలుపవలయు
పూర్వాంబునను దంతములు ద్రోమి తద్దయు
నరుచి హారంబుగా నపుడు వేగ
నుష్ణోదకము చేత నిష్ఠీవనము చేసి
మితముగ మోము క్షాళిత మొనర్చి
మూర్ధంబునను వస్త్రముకు గట్టి నేర్పుగా
వామభాగంబునఁ బవ్వళించి

ధూపమైయున్న వెచ్చని తోయములును
గ్రోలి మేనున సన్నంపు జ్వాలచేత
సమ్మతిగ గాచవలయును జ్వరముపక్వ
మైనపర్యంత మిట్టుల ననుదినంబు॥

గీ॥ విషమముల కెల్ల దినచర్య వినుడివైద్య
శాస్త్ర పద్ధతిచేతను సలుపవలయు
అంజనంబును గండూషణౌషధమును
వస్తి నస్యంబు రక్షయు వసుధలోన ॥

సీ॥ తరుణ యౌవనములు దనరు మూడింటను
నాజంట తొమ్మిదిం టనగ బరగు
వృద్ధాప్యమునకును విశదంబుగా నేడు
వారంబు లననొప్పు వాతమునకు
జ్వరకర్తమునకును సరణిగా నాఱు క
ఫమునకు తొమ్మిదియు మఱి ద్వంద్వ
ములకెల్ల పదియును మూడును యామంబులు
వాతంబునకు నెల్ల, పైత్యమునకు

యామమున మేలు రెండవ యామమునను
కఫమునకు మేలునని యం్రదు ఘనులు నెపుడు
ఓగిర మొనర్చుటకు మేలు నుర్విలోన
నన్నిటికి మేలు నపరాహ్ణమం దటంద్రు

కం॥ పథ్యము రోగమ్ములకును
సత్యంబగు మఱియు నుష్ణసంభూతులకున్
పథ్యం బనిరిది యార్యులు
సత్యముగా లంఘనంబు జగతిన్ దెలియున్ ॥

---

శ్లో॥ తస్మాదాదౌషపచనార్జ్వరితానుపవాసయేత్ ॥ అ.హృ.
శ్లో॥ పథ్యేసతిగదార్తస్య కిమౌషధ నిషేవణమ్ !
పథ్యేసతిగదార్తస్య కిమౌషధ నిషేవణమ్ ॥
(లోలంబరాజీయము)

లంఘన వర్జ్యులు

గీ॥ గ్రహణి యతిసార క్షయకాస గర్భిణులకు
శిశువులకు వృద్ధులకు బలక్షీణులకును
అర్శమేహాద్వయ పరిశ్రమార్తులకును
స్ఫోటకములకు మిక్కిలి శోషగల్గు
వారలకు నేత్రరుజులకు వ్రణములకును
విడువదగు లంఘనంబురు బుధమిలోన ॥

గీ॥ శాస్త్రమెఱుగక వైద్యంబు సల్పెనేని
జగతిలోపల బ్రహ్మఘ్నసముఁడు దలప
శాస్త్రమెఱుగుచు వైద్యంబు సల్పెనేని
నతఁడు దైవజ్ఞుడని యండ్రు నార్యవరులు ॥

గీ॥ కాలము చేరిన రోగుల
కేలా పథ్యం బటంచు నేమఱక భువిన్
కాలము కుటిలం బనుచును
చాలన్ మది నెఱుఁగవలయు చతురత మొప్పన్ ॥

మాలిని వృత్తము

సరసిజదళనేత్రా । శ్యామజీమూతగాత్రా ।
సురరిపు భయనాశా । సూర్యకోటి ప్రకాశా ।
సరసిజ హితవంశా । సజ్జనాఘౌఘ నాశా ।
ధరణిజ ? హృదయేశా । దైత్యవర్గ ప్రణాశా ॥

గద్య

ఇది శ్రీ రామచంద్ర చరణారవింద ధ్యాన హృదయ ప్రదీపక సకల సుకవిజనవిధేయ ధేనుకొండ జోగనామాత్యపుత్ర భిషక్ఛాస్త్ర ప్రవీణ కేశవనామధేయ ప్రణీతంబైన వైద్యచింతామణి ప్రథమాశ్వాసము సంపూర్ణము

ఇది ప్రథమాశ్వాసము



# ద్వితీయాశ్వాసము



క०॥ శ్రీ మానినీ మనోహర ।
తామరస దళాక్ష । ఘోరదానవ హరణా ।
చామీకరాంబర ధరా ।
శ్రీమత్ క్షితిభృల్లలామ । సీతారామా ॥

వ॥ అవధరింపుము

క०॥ రసమును, సాధారణముప
రసము మహారసము లోహ రత్నముల శుచిన్
రసికులు మెచ్చగ వాఙ్మధు
రసముం జిలుకంగఁ గవిత రచియింతు భువిన్ ॥

## రసశోధనము

గీ॥ వినుడు సర్వజ్ఞు లభవుని వీర్యమెపుడు
పల శతంబు ప్రయోగింపవలయు మఱియు
యేబదైనను యిరువదియేనునైన
పదియు రెండైన నారైన వయస నిల్లు
త్రయమునైననుఁ దివిరి తదర్ధమైన
బహువిధంబుల పూజించి భవ్యముగను
మంత్రితము జేసి ఖల్వంబుమధ్య నిడగ
వలయు నిందుల తక్కువ వలను భువిని ॥

గీ॥ హరుని రేతంబు గృహధూమ్యా హరితకన్య
గూర్చి మర్దించి యెండను నార్చికలిని
క్షాళనము చేయ రసము దోషం బణంగు
... ... ... ...॥

---

అభవునివీర్యము = పాదరసము
గృహధూమ్య = కరిధూపము. హరితకన్య = పచ్చికలబందగు జ్జు

ఉ॥ ఉత్తమ కన్య కన్యయును నుప్పి హరిద్గిరి కోల బింబము
న్మత్తము నర్ణవి న్ననల మారుతరోదహి ? నేత్రసారముల్
చిత్తజవైరి రేతమును జేర్చియు భావనఁజేసి క్రమ్మరన్
సత్తుగ నారనాళమున క్షాళన జేయ హరించు దోషముల్ ॥

వ॥ గ్రంథాంతరమున

సప్తకంచుక దోషములు

గీ॥ రసమునకు సప్తదోషముల్ పొసగియుండు
ఉరగ మల శిఖ విష వంగ గిరి చపలము
లనగఁ జెల్లును తద్దోష హరణమునకు
నై యుపాయంబు జెప్పెద నవనిలోన ॥

నాగదోష నివారణములు

కం॥ నిమ్మ, కుమారి, రసంబుల
నమ్మతి హరితేప్తిగూర్చి, శంకర రేత
స్సమ్మర్దమ్మున కలిచే
క్రమ్మఱ మేల్కొల్ప నాగకలుషము బాయున్

మలదోష నివారణము

కం। ఆరగ్వధ మూలత్వచ
మారూఢిగ వ్యాఘ్రచరణి హరవీర్యంబున్
గూరిచి మర్దించియుఁ
గా, ఢ్పాదించిన తన్మలౌఘ మణఁగును ధాత్రిన్ ॥

అగ్నిదోష నివారణము

గీ॥ వామదేవుని రేతఃబు వ్యాఘ్రచరణి
యనలముననఁ గూర్చి మర్దించి యార్చి వస్త్ర
గాళిత మొనర్చి మఱి యార నాళమునను
క్షాళనము జేయ నగ్ని దోషంబణంగు ॥

---

ఆరనాళము = కాంజికము లేక కలి.

కుమారి = కలబంద. చిత్తజవైరిరేతము, వామదేవుని రేతము = పాదరసము.

## విషదోష నివారణము

గీ॥ త్రిఫలములతోడ త్రిపురారి తేజమునను
గూర్చి బరువడి కన్యతోఁ గూడ నూరి
యాతపముచేత నారించినపుడు కలిని
క్షాళనము జేయ విషజదోషం బణంగు ॥

## గిరిదోష నివారణము

కం॥ నాగరయువ నేష్టంబును
మాగధి కన్యయును గూర్చి మారారిసుతుం
బాగుగ భావన జేసిన
బాగా గిరి దోషమణగి వసుధాస్థలిలోన్ ॥

## వంగదోష నివారణము

కం॥ గిరికోల యింద్రవారుణి
సరిగా భాగములు గూర్చి స్థాణుని రేతం
బురువడి కన్యతో నూరిన
హరియించును వంగదోష మాశ్చర్యముగన్ ॥

## చపలదోష నివారణము

కం॥ భూతాధిపు రేతంబును
మాతుల కన్యయును గూర్చి మర్దించియుఁ బై
నాతపమున నార్చియుఁ గలి
నాతరి మేల్కాలుప చపల మణగున్ జగతిన్ ॥

## రస క్షాళనము

కం॥ ప్రతతముగ దోషమునకు
మతిమంతులు బాండవమును మరి కలితోక్షా

మారారిసుతుడు, త్రిపురారి తేజము = పాదరసము, నాగరము = శొంఠి.

ళిత మొనరించిన కరుణా
న్వితమై మానవులఁ బ్రోచు పృథివీస్థలిలోన్ ॥

## రసభస్మ ప్రకారము

కం॥ పటికయు మణిబంధముతో
నిటలాక్షుని యింద్రియంబు నేర్పుగ కలిచే
ఘటికాత్రయంబు నూరియు
ఘటమున నిడి వండెనేని కడుభస్మముగన్ ॥

కం॥ తారాపతి బింబం బన
తారాగము నిగ్గనంగ ధర రుచిర మనన్
మారారి మేని చాయను
పారద భసితంబు నెగడు వసుధాస్థలిలోన్ ॥

## రససిందూర ప్రకారము

మత్తకోకిల॥ శుద్ధి జేసిన గంధకంబును 1. సూతతుల్య మొనర్చిన
వృద్ధిమంతులు గాజుకుప్పిని బోసి వండిన పచ్చనై
శుద్ధమై మరి ధూమ మెడలిన సూటిగా నవసారముఁ
శుద్ధిఁజేసిన తాళసీసము సూతతుల్య మొనర్చియు
పొందగాను సలాకుచేతను బూని తద్దయుఁ ద్రిప్పినఁ
సిందురించు నినప్రభఁ రససింధు రంబతి శీఘ్రతన్ ॥

## రససిందూర గుణము

చ॥ సుర లమృతంబు ద్రావి కడు చోద్యముగా జర మృత్యు బాధలన్
బారలక లేత ప్రాయమున బొందిన రీతిని తత్సమానమై
జర మృతి బాధలం దునిమి సత్యముతో జనకోటి కెప్పుడున్
చిరతర యౌవనంబలరఁ జేయును సింధురభావ మెట్టిదో ॥

సీ॥ 2 గట్టురాయని పట్టితోఁ గామకేళి
శంకరుఁడు కోర్కె పుట్టంగ సల్పుచున్న

---

1. సూతము = పాదరసము. 2. గట్టురాయనిపట్టి = పార్వతి.

సమయమున చండికకు మేను ఝల్లు మనియె
నంత నగుసిగ్గుతో రేతమువని విడచె ॥

వ॥ తద్రేతంబువలన మహారసోపరస సాధారణ రసంబుల నంబఱగె నందుల నభ్రకప్రకారంబు లెఱింగించెద.

అభ్రకము

గీ॥ అంబరము నాల్గువిధము లనం బరంగు
నాగ మాండూక వజ్ర పినాకము లన
వాని భేదంబు తెలియని చోని కెల్ల
1 దివికొమరు సంగడీని చేఁ దెలియవలయు ॥

కం॥ నాగంబు వహ్ని నిడినను
నాగమువలె చేయు రోదనమ్మును మిగులన్
నాగము శ్లేష్మాధికమగు
2 రోగములను సంఘటించు రూఢిగ నవనిన్ ॥

కం॥ మండూకము మంటను నిడ
మండూకమువోలె నెగసి మఱిపడి మాయున్
మండూకము సేవించిన
3 పాండురరోగముల జేయు వసుధాస్థలిలోన్ ॥

అచ్చ తెనుగు:

బయలుకొమరుని చెలికానిపై పినాక
మిడిన మొఱ జాలువలె నుండు విడువ కదియు
సాఁపడిన మింటికొమరుని సంకటములు
పొడమునని యంద్రు వెజ్జులు పుడమిలోన

గీ॥ వహ్నిపై నేర్పు మీఱఁగ వజ్రకభము
విడిన గృహధూమకాంతిని వెడలనేని

1. దివి కొమరు సంగడీడు = అగ్ని. అభ్రకమును అగ్నితో పరీక్షింప వలయును.
2. మండల కుష్టమునుగూడ గలిగించును. ర.ర.స.
3. మాండూకాభ్రక భక్షణమువలన నశ్మరీరోగము కలుగునని రసరత్న సముచ్చయము.

నదియు నుత్తమ మని యంద్రు డార్యవరులు
మఱియు నదిగొన్న వ్యాధుల మదమణంచు ॥

## 1. ధాన్యాభ్రక విధి

ఉ॥ శుద్ధఘటంబువాతనొక చోద్యముగా పటముఁ ఘటించిన
ద్బుద్ధిని శాలి వజ్రనభముంగుదిగూర్చిన నంమఁ గ్రమ్మఱన్
తద్దయు కేలఁ బ్రాఁకినను తత్‌క్షణమాత్రములోన చట్టిలో
నుద్దవలెన్ మెలంగు నది సూటిగ వెన్నయటంచ్రు
భూస్థలిన్॥

గీ॥ తద్ఘృతాలయంబు తరుణిపయంబుల
నావుపాల మఱియు నాజ్యమునను
కొలని ? నీటిచేతఁ గూర్చి తింత్రిణిసార
మునను పదియునైను పుటము లిడియు ॥

వ॥ మఱియు నంతట

## అభ్రకభస్మవిధి

సీ॥ కన్య యుత్తమకన్య కన్య గోపీభిక్షు
కుండలి కుండలి కుముద, ముసలి,
మచ్చకంటహినేత్ర మందార మార్తాండ
నలదూలి శతపత్ర సారములను
ప్రస్థాద్రుమ ? చ్చర్మ సామజాశనచర్మ
సారంబులను సింధుసారరసము
రాజవృక్షము నిలరాజ పునర్నవ
శిఖివాలు మాలేరు శిగ్రుబృహతి

నాగమాత భిషజ్మాత నక్తమాల
బిల్వగంధ సితోత్పలవల్లి ఫలము
సారముల చేత గగనంబు వేరువేర
భావితము చేసి పుటమిడ భస్మమగును ॥

---

1. అభ్రక నవనీతము లేక ధాన్యాభ్రకము

గీ॥ గగనభసితంబు నార్ధ్రకగంధ గారి
నిమ్మరసముల మర్దించి నేర్పుమీఱ
పుటమువేసిన దాడిమ పుష్పకాంతిఁ
బరగు నది గొన్న మేహతాపముల నణఁచు ॥

వ॥ ఇంక, నటభూషణాది ద్రవ్యంబుల శుద్ధి గుణంబు లెఱిం
గించెద.

గీ కాంచనప్రభ వస్తునికాయములకు
నవనిలో శుద్ధు లిడుతఱి యంత్రభేద
జాల మెఱిగించు నెడలను డోలికాఖ్య
యంత్ర మని మది తెలియుఁడీ ! యార్యజనులు ॥

కం॥ నటభూషణంబు నేర్పుగ
పటమున బంధించి కలిని పంచితము తగన్
ఘటమున నిడి యంత్రముచే
ఘటికాత్రయ మగ్ని చేతఁ గాచిన శుచియౌ ॥

## మణిశిలా శుద్ధి

గీ॥ శిలను సూక్ష్మముగను ఛేదించి వస్త్రము
నమరఁ గట్టి డోలికాఖ్యయంత్ర
మునను ఛాగ మూత్రమున కొద్ది మంటను
వండె నేని దోషముండ దవని ॥

## మాక్షిక శుద్ధి

కం॥ కలిచే పంచితమునచే
నులవల జలమునను గూర్చి యొకొక దినమున్
కొలఁదిగ జ్వాలను వండిన
కలుషము నెడబాసి మాక్షికము శుద్ధియగున్ ॥

## కఫరి శుద్ధి

గీ॥ కఫరి వస్త్రముచేతను గట్టి మర్త్య
మూత్రమున మఱి గోమూత్రమునను డోలి
కాఖ్య యంత్రముచే నవయామములను
వండెనేనియు శుద్ధియౌ వసుధలోన॥

## ఇంగిలీక శుద్ధి

కం॥ దరదము స్త్రన్యంబులచే
మఱి లికుచరసంబుచేత మర్దనఁజేయన్
బరిశుద్ధిఁ బొందువాత
జ్వరముల, మేహోదరరోగసమితి, హరించున్॥

## టంకణ శుద్ధి

కం॥ తిలసంభవంబు నేర్పుగ
జలనుతులో నిడిన వేగసచ్ఛుద్ధియగున్.
ఇలలో నతిసారములను
గెలుచును సర్పముల గరుడి గెలిచినమాడ్కిన్

ఉ॥ మఱియు

కం॥ మాలతి చతురత్వంబున
జ్వాలను విడెనేనిపొంగి సచ్ఛుద్ధియగున్
చాల నతిసారములకును
మేలొసగును నిక్కంబు మేదినిలోనన్॥

## విమల శుద్ధి

గీ॥ తగరు మూత్రముచేతను దండులోద
కంబుచేతను మూచసారంబుచేత
డోలికా యంత్రమున వండ మేలుగాను
విమలములు శుద్ధిఁ బొందును విశ్వమునను॥

## మైలతుత్థము శుద్ధి

కం॥ పెరుగును శిఖితుత్థముక
ప్పెరలోనిడి నగ్నిపై నిఁ బెట్టినయంతన్
బరిశుద్ధిఁ బొందు శీత
జ్వరములఁ బరిమార్చు నిద్దిసత్యంబెన్నన్ ॥

## పాలతుత్థము శుద్ధి

గీ॥ పాలతుత్థము పలిమెడు పటమునందుఁ
గట్టి పాషాణ చూర్ణోదకమున నదియు
యంత్రమున వండనేనియు యామమునను
శుద్ధి బొందును భువిలోన చోద్యముగను ॥

## గంధక శుద్ధి

గీ॥ చిత్రముగ లోహపాత్రలోఁ జిత్రతైల
గంధకము గూర్చి వంచిన గడియలోన
కుటిల మెడబాసి ధరలోన కుష్ఠులనెడి
నాగముల కెల్ల మృగరాజునాఁగ బరగు ॥

## గౌరిపాషాణ శుద్ధి

గీ॥ గౌరిశిలయును మాక్షికసారమునను
వండనేనియు శుద్ధియౌ వసుధలోన
ప్రాంత వేడుల భంజించు పౌరుషమున
నదియు నెట్లన్న ఘోరవనాగ్ని పగిది ॥

## ఇతర పాషాణముల శుద్ధులు

గీ॥ నెల్లి దొడ్డిశిలలు యుల్లిపాషాణంబు
నశ్మ చూర్ణజలము నమర వండ
శుద్ధిఁ బొందు నివియు చోద్యంబుగాఁ జలి
యుష్ణములను ద్రుంచు నుర్విలోన ॥

## నేపాళముల శుద్ధి

గీ॥ చతురతరముగ దంతిబీజములు కన్య
దళరసంబుననైన ఘృతముననైన
గోమయమ్మునవైననుఁ గూర్చి సూక్ష్మ
జ్వాలచేతను పరిశుద్ధి సలుపవలయు॥

## నాభి శుద్ధి

కం॥ వసనాభి పసుజలంబున
మసలక యుంచుంచి తివియ మఱి శుచి బొందున్
వసుధాతలమున పొందుగ
వెసరోగము లెల్లద్రుంచు విస్మయము మొప్పన్॥

వ॥ మఱియు

గీ॥ కాలకూటము తునియలుగాను మొత్తి
సురభిమూత్రములోనిడి సూటిగాను
సూచికాగ్రము చేతను సారగవేగ
గాడినను శుద్ధియౌనని కడు తెలియుడి॥

## ఆముదముల శుద్ధి

కం॥ పొందుగ నాముదములతో
నందుల ముక్కంటినీట నమరగ నిడియున్
మందాగ్ని చేత వండిన
సందియమును లేక దీన సచ్ఛుద్ధియగున్॥

## గుగ్గులు శుద్ధి

కం॥ వరరసము భాండమున నిడి
బరువడి గుగ్గిలము పటము బంధించి యతి
త్వరితముగ వండెనేనియు
వరలగ వ్రణములనుఁ ద్రుంచు వసుధాస్థలిలోన్॥

నాభిని గోమూత్రమున నేడుదినములు భావనచేయుచు నెండ నెండించవలయును

## లవణముల శుద్ధి

గీ॥ అబ్ధి లవణంబు కప్పెరయందు నిడియు
గాడ్పునెచ్చెలిపై నుంచ గడియలోన
పరమశుచి బొందు జనులకు నిరతముగను
మ్రదసోపేతమై యుండు జగతిలోన ॥

కం॥ మణిబంధము కాంజికమున
గుణవంతులు నేర్పుచేతఁ గూరిచి యెండన్
అణుమాత్ర మూరనిచ్చిన
గుణమిచ్చును జీర్ణములకు కుంభినిలోనన్ ॥

కం॥ రుచికము గోమూత్రమున లి
కుచరసమున నూరెనేని కుట్టలము బాయున్
శుచిగల్గియుండు నెప్పుడు
రుచిరోగము లెల్లద్రుంచు రూఢిగ నవనిన్ ॥

గీ॥ ఖండపటు నేర్పుమీఱఁగ ఖల్వమధ్య
తక్రముననైన సురభి మూత్రముననైన
భావితముసేయ కలుషంబు పాసియదియు
పరమ శుచిబొందు దీపన కరము భువిని
శుక్తి పత్ర రసమ్ముచే సుమతులార
కాచలవణమ్ము నేర్పుగా ఖల్వమధ్య
నిడియు మర్దించెనేనియు గడియలోన
శుద్ధి బొందును భువిలోన శూల లణచు ॥

## సర్జక్షార శుద్ధి

కం॥ సజ్జాకారము కలిచే
కజ్జలముగ నూరెనేని కడుశుచి బొందున్
వెజ్జులు మఱి నానియూడగ
మజ్జాగతజ్వర మణంచు మహిలో నెపుడున్ ॥

## యవక్షార శుద్ధి

కం॥ యవభూతి కలిని నూరిన
నవిరళముగ దోష మణఁచు నతి సుగుణంబై
భువిలోన హిక్క లనియెడి
శవాశనులకును వెన్నువాజియు పోలెన్ ॥

## శిలాజతు శుద్ధి

కం॥ శిలజతు ఖల్వంబున నిడి
కలహార రసంబుచేత ఘటితము జేయన్
గలుషము బాసియు శుచియై
పౌలఁతులకును మూత్రరుజల పొలియించు భువిన్ ॥

## ఇంగువ శుద్ధి

కం॥ రామఠము జలజరసమున
యా మార్ధము నుంచి తివియ నంతట శుచియౌ
ధీమంతులు క్రిమి వ్యాధుల
కేమారును నిడుదు రిదియు నిలలో నెపుడున్ ॥

## 1. కుందురుష్క శుద్ధి

కం॥ ఇమ్మగ నిమ్మరసంబున
క్రమ్మఱ నరమూత్రమునను ఘటికాత్రయమున్
రుమ్మస్తకి 1. నందుల నిడి
సమ్మతమునఁ దెలియనదియు సచ్ఛుద్ధియగున్ ॥

## గజపిప్పలి శుద్ధి

కం॥ గజపిప్పలి కలిచేతను
నజమూత్రముచేత నూరి యార్చిన శుచియౌ
గజమును కేసరివోలిక
గజిబిగి గావించు మూత్రఘాతం బవనిన్ ॥

1. రూమీమస్తకి

గీ॥ శ్యామధుత్తూర బీజముల్ చతురముగను
వస్త్రమునఁ గట్టి జంబీర ఫలరసమున
యామ మాత్రంబు నిడ నేని యఘము బాఁసి
శుద్ధి బొందును ధాతుసంవృద్ధిఁ జేయు ॥

### 1. విషముష్టి విత్తుల శుద్ధి

గీ॥ ముసిడి విత్తులు ఛేదించి ముఖ్యముగను
ముదిర మూల రసంబున మూఁడు నాళ్లు
స్థాపితము జేయ శుద్ధియౌ జగతిలోన
విషమ పిటకాదులనుఁ ద్రుంచు విస్మయముగ ॥

### శొంఠి శుద్ధి

గీ॥ శొంఠి నేర్పుగ పాషాణ చూర్ణమునను
నలఁది యాతపమున నార్ప యంతలోన
శుద్ధిబొందును జఠరాగ్ని వృద్ధిజేయు
కఫ తృషాకర్త్ర వాత నికాయ మణచు ॥

### మిరియాల శుద్ధి

గీ॥ వల్లిజము నేర్పు మీఱగ వల్వయందు
గట్టి తక్రంబులో నిడి గడియలోన
తివిసిరేనియు శుద్ధియౌ తీవ్రముగను
వాత సంజాత రుజల పెన్వాఁడిఁ జెఱచు ॥

### వాము శుద్ధి

కం॥ సున్నపు నీళ్లను దీప్యము
పన్నగ ఘటితంబుఁ జేయ పటుశుచి బొందున్
జెన్నగ తద్గుణజాలము
పన్నగరాట్తల్పసుతుని వశమే తెలఁపన్ ॥

---

1. చిత్రికారరసములోను నిమ్మ రసములోను నానవేయుట పాలలో నుడికించుట గూడ ముషిణిగింజలకు శుద్ధి.

## శంఖ శుద్ధి

కం॥ ఆరూఢము శంఖంబును
నారూఢిగ నారనాళ మందున నిడి రెం
డాఱు ప్రహారంబులలో
నేరుపుగాఁ దివిసిరేని నిజముగ శుచియౌ॥

## ఇతర రసద్రవ్యముల శుద్ధులు

గీ॥ కాసిశంబులు చపలముల్ గైరికములు
నంజనంబులు కంకుష్ట మాది గాఁగ
రసములకు నెల్ల జంబీరరసము భృంగ
సారమున నూర శుద్ధియౌ జగతిలోన॥

వ॥ ఇంక గ్రంధి ద్రవ్యముల శుద్ధు లెఱింగించెద

సీ॥ మాతంగశౌండి తమాలపత్ర వరాళ
బర్హిష్ఠ త్రుటి శృంగి వారి భవ్య
కైరళ కోమలి గంధనాకులి గౌరి
ప్రాణద శివ భూతవాస జటిల
కాముక శఠి క్షీరకాళిక వాలుక
తాళిశ శతపుష్ప ధనిక మధుక
సురదారు తుంబురు సోపు వత్సకఫల
శాజీర నాగర జటిల మజ్జ

చపల వారాంగ పర్జన్య చపలమూల
భృంగివిశ్వాస బర్బర భంగురములు
నాదిగాఁ గల్గు వస్తువు లవనిలోన
భర్జితము జేయ శుద్ధియౌ భవ్యముగను॥

వ॥ ఇంక దశ లోహ భస్మక్రమం బెఱింగించెద.

కం॥ తపనీయ కాంస్య చుంబక
త్రపు శిలరుహ తీక్ష్ణలోహ తామ్ర రజిత పూ
తిపవనభుగ్ లోహాదుల
విపులాస్థలి యందు వానివిధ మెఱిఁగింతుర్ ॥

## పుటసంజ్ఞ

గీ॥ జాతరూపాదిలోహ సత్సంఘములకు
పుటవిభేదము జెప్పిన ముందుకతన
కరిపుటంబని తెలియుఁడి ధరణిలోన
సరసగుణులార ! వైద్యశాస్త్రజ్ఞులార ॥

## స్వర్ణశుద్ధి

గీ॥ జాతరూపము ఛేదించి చతురముగను
రక్తవల్మీక మృత్తిక రయము నలఁది
యార్చి మఱియు శరావమునందు నిడియు
పుటము వేసిన శుద్ధియగు పుడమిలోన ॥

## స్వర్ణభస్మ

గీ॥ భర్మ మాక్షిక జంబీర ఫలరసమున
భావితము జేసి । హాటక పత్రములకు
నద్ది యార్చి శరావమునందు నిడియు
పుటము వేసిన భస్మమగు పొలుపుమీఱ ॥

## స్వర్ణ సిందూరము

సీ॥ కాంచనభూతి సంఘటితంబుగా హరి
శిశువర్ధనమ్మునచే శీఘ్రముగను
సద్భావితముజేసి సామజాశన చర్మ
సారంబుచేనూరి చతురముగను
తద్భస్మమునకును దరదంబు సమమిడి
వానరమూల ద్రవంబుచేతఁ

---

।యాటకమని మూలప్రతి

బరువడి ఘృతమంద పత్రసారముచేత
మర్దింపవలయును మఱియునాల్గు
వాసరంబులు నంతట వరశరావ
ములను స్థాపించి కాంతారముచిఫలమును ?
దంతి పుటములు నైదిశ తత్క్షణమున
భానుబింబ ప్రదీప్తి చేఁ బరగు భువిని ॥

కం॥ కురువింద మెఱుపో కాకను
హరి తేజమొ బింబఫలమొ హరుపుష్పమొ సిం
దురపుఘుటికరుచియో యన
నరుణప్రభ నెగడు హాటకైశ్వర్యములన్ ॥

కం॥ కమలాప్తుం డుదయించిన
తిమిరం బెడబాసి దిశలు తేజంబొంత
క్రమమున స్వర్ణము కృయలను
తిమిరం బెడబాపి దేహ తేజం బొసఁగున్ ॥

వ॥ ఇంక కాంస్యశుద్ధి భస్మ సిందూరంబు లెఱింగించెద

## కాంస్య శుద్ధి

కం॥ కప్పెర (కమర) కమఠముపై నిడి
యొప్పగ కాంస్యమును మఱియు నులవల నీటన్
దప్పక యంకుల నిడి యా
చొప్పగ ము మ్మారు వండ శుచిబొందు భువిన్ ॥

## కాంస్య భస్మ

కం॥ పట్టెడ పటులోహమ్మును
వెట్టియు చర్మేష్టిచేత విరివిగ రేకుల్
గొట్టియు బలిరవిముగ్ధము
దట్టముగను పూసి యార్చి దట్టం బొప్పన్ ॥

వజ్రమూష

గీ॥ శ్వేతపాషాణతుష కూర్చ శ్వేత వస్త్ర
భసిత వల్మీక మృత్తిక పరగఁ గూర్చి
మూష యొనరించి యార్చిన ముఖ్యముగను
వజ్రమూష యటండ్రు సద్వైద్యు లవని ॥

వ॥ వెండియు

గీ॥ వజ్రమూషను తత్కాంస్య పత్రములును
నిడియు వారణపుటమిడ మఱియు పురుష
... ... ...
వజ్రనిభముగ నైశ్వర్య ప్రభ వెలుంగు ॥

కాంస్య సిందూరము

కం॥ పటులోహ భస్మ సమముగ
పటుబుద్ధిని గంధ, దరద, భాగమ్ములతో
ఘటియించి ఖల్వ మధ్యను
వట పయములచేత నూరవలయును మఱియున్ ॥

సీ॥ హంసపాదిరసంబు నశ్వక్షీవల్కల
క్వాథంబు బర్బర క్వాథమునను
గింశుకరసమునఁ గీలించి మర్కట
మూల ద్రవంబున ముఖ్యముగను
జంబీర రసమున చతురత మర్దించి
వరగుణులది శరావమున నిడియు
విపినోత్పలంబులు వేమారు దశశత
ములు గూర్చి పుటములు ముదముతోడ
వేసి రేనియు హరిదీప్తి వెల్గుచుండు
క్రమ్మరది మూష నిడి విశ్వకర్మ పుటము
నేడు మారులు వేసిన నాడెముగను
కాంస్య భసితంబునకును సత్కాంతి మించు ॥

కం॥ పన్నగ వల్లభుఁ డవలని,
మిన్నగ కుమారకునిఁ జేరి మెక్కినరీతిన్
పన్నగ కాంస్యవిభూతియు
పన్నగమై వాతరుజలఁ బట్టువుగ మ్రింగున్ ॥

వ॥ ఇంక కాంతశుద్ధి భస్మ సిందూరగుణంబు లెఱింగించెద.

## శ్లేష్మకాంత లక్షణములు

కం॥ చుంబక పాత్రను జలములు
నింబరసంబడియు వండ నిపుణత యొప్పన్
నింబరసం బెడఁ బాసిన
చుంబక మది శ్లేష్మమంద్రు సుస్థిర, తజ్జ్ఞుల్ ॥

వ॥ మఱియును

గీ॥ గురుతరంబైన మిక్కిలి బరువునైన
ధాతు శ్యామల యుక్తమై తనరియున్న
నశ్మసంభవ మీక్షించి యద్భుతముగ
తాఁకినను నది శ్లేష్మకాంతం బటంద్రు

## కాంత శుద్ధి

కం॥ కాంతపు పాషాణంబులు
కాంతారోత్పల సహస్రకము చేత పుటం
బంతట నొనర్చి యజమూ
త్రాంతస్స్నాపితము జేయఁ దగశుద్ధియగున్ ॥

## (సాంకేతికము) కాంత భస్మ

చ॥ పరిశుచియైన కాంతమునపాదము, గంధకముం ఘటించి యియ్యం
దరణి కుజ ద్రవంబునను తామరసోద్భవు వృక్షసారమున్
మఱికలు గంగ నీటనిడి మర్దనఁ జేసియు వైద్యశేఖరుల్
కరిపుటముల్ త్రయం బిడిన కాంతము రాప్య సమాన
భస్మమౌ॥

## కాంత సిందూరము

కం॥ దరదము కాంత విభూతికి
సరవిఁ సగ మాత్మగుప్త సారముచేతఁ
వెరవుగ మూఁడు దినంబులు
బరువడి మర్దించి యంత పటుతర బుద్ధిఁ ॥

గీ॥ ధాతు వల్మీక మృత్తికచేతఁ దనరు
వజ్రమూషకు మృత్తికవస్త్రపూత
మలఁది తద్దయు తద్భస్మ మందునిడియుఁ
గరి పుటత్రయ మిడ కెంపు కాంతి యొప్పు ॥

గీ॥ వార్ధి పూరంబునకు బాడబంబు పగిది
వారిదములకునతి జగత్ప్రాణుకరణి
పాండుక్షయలకు కాంతంపు భసిత మట్లు
యచ్చు నెడబాపు నవలీల నవనియందు ।

వ॥ ఇంక రౌప్య శుద్ధి భస్మ సిందూరగుణంబు లెఱింగించెద.

## రౌప్య శుద్ధి

కం॥ కమఠములో రౌప్యము నిడి
క్రమమున నరకాఁక లిడుచుఁ గడుదాఁగలిపై
నమరించియు చర్మేష్టిని
సుమతిఁ ప్రహరింపవలయు సూటిగ నదియుఁ ॥

కం॥ రేకుల నొనర్చి గొడ్డగు
కాఁకర దుంపలరసంబు ఘటియించి తగఁ
మూఁకుట నిడి మందాగ్నిని
ప్రాకటముగ నేడు మార్లు వండిన శుచియగు ॥

## రౌప్య భస్మ

గీ॥ చాన చనుబాలచేతను జాతరూప
మాక్షికంబైన మఱి కాక మాక్షిమైన

భావితము జేసి కలధౌత పత్రములకు
దట్టముగ నద్ది యూటించి తడయ కపుడు॥

గీ॥ వజ్రమూషను నిడియు నవ్వాయి మూసి
దట్టతనమున కానవోత్పల సహస్ర
కము పుటంబిడ నేనియు గడియలోన
హారుని మై పూత భూతి యనంగ బఱగు ॥

రౌప్య సిందూరము

సీ॥ చంద్రహాస విభూతి సమము దరదము నిడి
కమలాప్త దుగ్ధ సంఘటితముగ (ను)
భావన గావించి వారణ పుటమిడి
తుమ్మచెక్కల నీటితో దఁగాల్చి
మర్దించి మఱికీట మారి, రసంబున
పాందొనర్చియు రెండు పుటము లిడియు
న్యగ్రోధ పయముల నేర్పుగా మర్దించి
మాతంగ పుటమిడి మఱియు నంత

మర్కటీ మూలరసమున మఱల నూరి
చెఱుకు పానకమునఁ గ్రూర్చి మఱియు మఱియు
దంతి పుటముల నిడె నేని తత్క్షణమున
సిందురించును సౌగంధి చెలువముగను ॥

కం॥ హరిబహు రూపుల చేతనుఁ
బరిమార్పునఁ బ్రళయమునను బహుజనకోట్లన్
మఱి రౌప్య మివ్విధంబున
హరియించును వాతజల నద్భుత మొప్పన్ ॥

వ॥ ఇంక మండూర క్రమం బెఱింగించెద

## శ్రేష్ఠ మండూరము

కం|| శతవత్సరములు మిగిలిన
నతియోగ్యం బెనుబదేను లైనను మధ్యం
బతిఘన మండుర (పంచా)
శతివర్షము లైన నది విసర్జించు డిలన్ ||

గీ|| అధిక లఘుతరమై యున్న నరుణమైన
పలుచనై యున్న దొండ్లైన వసుధయందు
సంస్థితం బైన మఱియు వత్సర శతంబు
లైన చిట్టంబు శ్రేష్ఠమై యమరు భువిని ||

## మండూర భస్మ

కం|| సామజపుటమిడి చిట్టము
గోమూత్రము ఛాగజలము గొఱెమూత్రములో
వేమాఱు నిడి యులూఖము
లోమాటియు మొత్తవలయు రూఢిగ వెజ్జుల్ ||

గీ|| శూర్పమున నిడి కొండియు సూటిగాను
ఖల్వమధ్యను స్థాపించి కజ్జలముగ
భావితము జేసి కలగర పత్రసార
మునను మర్దించి సామజపుటము వేయు ||

## మండూర సిందూరము

సీ|| పిచుమందజంబు జంబీర భాస్కరనిశ
పావకారగ్వధ వై జయంతి
గోక్షుర భూదేవి కోకిలాక్ష పటోల
వజ్రవల్లి, గుంభూచి, వాల్లుకములు
ఇక్షు పటోల నీలి క్షుద్రవారాహి
శ్వేత మూలాలర్క శిగ్రు ముండి

బ(ర్బ)ర ? తక్కోలల బ్రహ్మదండి కరంజ
పాలాశ నిర్గుండి పారిభద్ర

బ్రహ్మ సోమ నిదిగ్ధిక బ్రహ్మి శృంగి
మూలరసముల మర్దించి ముఖ్యముగను
ముప్పదియు నాల్గుమారులు పుటము లిడిన
బంధుకము భాతి చిట్టంబు సిందురించు ||

వ|| ఇంక భావనమండూరక్రమం బెఱింగించెద

ఉ|| కుండలి పత్రసారమున కోకిల నేత్రి గులూచి గూర్చిని
ర్గుండి దళ ద్రవంబులను గొజ్జలముం మఱి యర్క దుగ్ధముం
ముండిరసంబునం త్రిఫల మూర్వ రసంబులతోడ నేర్పుగా
మండురముం ఘటించి పదిమారులు భావనజేయ మే
లగుం ||

గీ|| నలినములు పెక్కు దనరిన కొలకులోన
సామజము చొచ్చి పరిమార్చు చందమునను
నలిన పాండుర శోఫావళుల నడంచి
దండిగను మేన సుఖమిచ్చు మండురంబు ||

వ|| ఇంక లోహశుద్ధి భస్మ సిందూర లక్షణంబు లెఱింగించెద.

లోహశుద్ధి

గీ|| అబ్దశతమై పురాతనమైన వాలు
నాకుతాఁతను చూర్ణంబు లమరఁజేసి
తైలమున వండి బ(ర్బ)ర ? త్వగ్ద్రవమున
మఱల వండిన శుద్ధియౌ మఱియునంత ||

లోహభస్మ

గీ|| చించ పల్లవ రసమున శిగ్రుమూల
సారమున ధేనుజలమున జంబు ధాత్రి

ఫల రసంబుల మర్దింప భవ్యముగను
దంతి పుటములు నైదిడ దనరు భూతి ||

కం|| హారితక విద్రుమ ఫలములు
ధరఫలములు గూర్చినట్టి తత్క్వాథమ్ముం
న్నరయుచు బది పుటములునిడ
వరమై లోహంబు పాండువర్ణం బణంచున్ ||

గీ|| సూర్య శిశు వర్ధనంబుచే సూటిగాను
భావితము జేసి న్యగ్రోధపాల నూరి
మూషలో నిడి యదియును మూఁడు మార్లు
కరగి రేనియు తీక్ష్ణము కాంతిహెచ్చు ||

అచ్చ తెనుగు :—

గీ|| జక్కవుల మేలు (డి) పాలనుఁ
జెక్కల విడు మజ్జిచెట్టు చెక్కల నిడి తా
నుక్కపోడి భూతి పుటముల
చక్కగ నిడ చాయమగని సరిడా లొప్పున్ ||
గ్రంథాంతరమున

సీ|| శస్త్రలోహవిభూతి సాతలార్ద్రికసార
ములనూరి యీరేడు పుటములిడియు
గారి వాశా మృత కౌమారి వృశ్చిక
సారముల్ మఱి వరసారమునను
నలుబది రెండు మారులు నట్లు గజపుట
ములువేసి మఱియు గోమూత్రమునను
వహ్ని న్యగ్రోధంబు వజ్ర త్వఙ్మర్కట
పత్రసారముల ముప్పదియు నైన
మఱియు వారాహికిటమారి హార్యలర్క
క్షురక నిర్గుండి జంబీర క్షుద్రబింబి

పత్ర రసముల నూరి యర్వదియు మూఁడు
పుటములిడగాఁ బ్రశస్తమౌ పుడమిలోన ॥

కం॥ కైరవ బాంధుఁడు వాఁడమినఁ
గైరవ హితకాంత మణులు కరఁగిన రీతిఁ
ఘోరమగు గుల్మ మణులను
నీరుగ కరఁగించు లోహ నిరుపమ శక్తిఁ ॥

వ॥ తామ్రశుద్ధి భస్మ సిందూర గుణంబు లెఱింగించెద

కం॥ భావజ్ఞులు రవిలోహము
పావకమున నిడియు మఱియు పటుఁ మృత్తిక చేఁ
బ్రావుచుఁ గాల్చుచు మొత్తుచు
నీ విధమున సూక్ష్మదళము లిడఁగా వలయున్ ॥

## తామ్ర శుద్ధి

గీ॥ చల్లయును కుమారియును మత్స్యాక్షి చించ
సారములను కుళుత్థ కషాయమునను
నేడుమారులు వంచిన నాడెముగను
శుద్ధి బొందును తామ్రంబు చోద్యముగను ॥

## తామ్ర భస్మవిధి

గీ॥ భాను పత్రములకు బలి తత్సమం బిడి
భాను దుగ్ధములను పరగఁ గూర్చి
తద్దళముల కలఁది దంతిపుటంబిడ
భూతి యగును వజ్ర భూతియనగ ॥

మ॥ హరి భస్మంబు భిషగ్వరుల్ భువిని కన్యాసారమున్
గూర్చియున్
మఱిలన్ శ్రేష్ఠ కషాయమున్ ఘృతమునన్ మర్దించి గో
దుగ్ధముల్

వెరవొప్పఁగ ఘటియించి హస్తిపుటముల్ వేమారు వే
యంగ భా
స్కర తేజంబును బొందు ఛర్ది భ్రమ మూర్ఛల్ ద్రుంచు
సత్యంబునన్ ॥

తామ్ర సిందూరము

సీ॥ భానులోహ విభూతి భానుపయంబుల
మర్దించి పుటమిడి మఱియునంత
నజదుగ్ధముల నూరి గజపుటమిడి సొను
జాశన వల్కల సారమునను
మర్దించి వేవేగ మాతంగపుటమిడి
ఘృతమందు సారము గీలుకొల్పి
వానర పుటమిడి వనచర రసమున
నూరి నాగపుటంబు గారవమున

వేసి ప్లక్షరసంబున వెరవుగాను
వట పయంబుల మర్దించి వరుసరెండు
హస్తి పుటముల వేసిన హరిసమాన
కాంతి నొప్పును హరిభూతి క్ష్మాతలమున

తామ్రభస్మ గుణము

గీ॥ పౌర్ణమాసిని కైరవ బాంధవుండు
బాడమును నంతట నబ్ధియు పొంగుపగిది
తామ్ర భసితంబు మెసవిన తత్క్షణమున
ధాతు సంవృద్ధి జేయును ధాత్రిలోన ॥

వ॥ ఇంక నిత్తడి శుద్ధి భస్మ సిందూర గుణంబు లెఱింగించెద

పిత్తళ శుద్ధి

కం॥ ఇత్తడియు నాకురాతను
మెత్తగ చూర్ణం బొనర్చి మేధావంతుల్

సత్తుగ వావిలిరసమున
నుత్తప్తము లైదుజేయ నొగి శుద్ధియగున్ ॥

## పిత్తళ భస్మ

గీ॥ శుద్ధిజేసిన పిత్తళచూర్ణమునకు
సరిగ బలితాళ మణిశిలల్ సంఘటించి
నింబరసమున మర్దించి నేర్పుమీర
నష్టపుటములు వేసిన నగు విభూతి ॥

## పిత్తళ సిందూరము

గీ॥ తొలుతఁ జెప్పిన కాంస్య సిందూర రీతి
పోల్కె నెఱిఁగియు పిత్తళ భూతినట్లు
పుటము లిడనేని మంకెన పువ్వుచాయ
ధరను దీని గుణంబెన్నఁ దరమెవిధికి ॥

వ॥ ఇంక నాగశుద్ధి భస్మ సిందూరంబు లెఱింగించెద.

## నాగ వంగశుద్ధి

కం॥ తిలసార గోజలంబుల
కలినీఁ దక్రాజదుగ్ధ ఖద్యోతరసం
బులును లవసీట ? తప్తం
బులు జేసిన నాగ వంగములు శుద్ధియగున్ ॥

## నాగ భస్మ

కం॥ పరిశుద్ధిమైన నాగము
కరఁగియు దీప్యమున వాసకద్రవ మిడియున్
వెరవుగ నుమ ? శాప్మముచేఁ
బరువడి భర్జించెనేని భసితం బొప్పున్ ॥

## నాగ సిందూరము

గీ॥ పన్నగవిభూతి యహివల్లి పత్రరసము
ముంచి రసమును మఱి సింహాముఖరసంబు
గూర్చి మర్దించి క్రమ్మర కుప్పె నిడుచు
దశపుటంబుల నిడ రేని దనరుకాంతి ॥

వ॥ వంగభసిత క్రమం బెఱింగించెద.

## వంగ భస్మ

గీ॥ త్రపు శరావాన నిడి ధాత్రీ తరువిభూతి
యైన శిఖిభూతియైనను నమరఁగూర్చి
కింశుక ద్రుమకాష్ఠంబు కేలఁబూని
దట్టముగ భర్జితము జేయఁ దనరుభూతి ॥

## వంగ సిందూరము

ఆ॥ వంగభూతి చించ పల్లవరసమున
సర్పవల్లి పత్రసారమునను
భావితంబు జేసి వారణపుటమిడ
సిందురించు కెంపు చెలువముగను ॥

## నాగవంగ భస్మగుణము

గీ॥ పన్నగ విభూతి సేవించు వారలకును
వాత మేహాది వ్యాధుల వాడిజెఱుచు
శుక్ల సంవృద్ధి జేయును చోద్యముగను
దాని సమమగు గుణమెన్న త్రపు విభూతి ॥

వ॥ ఇంక నవరత్న శోధనంబును తచ్ఛుద్ధి భస్మ సిందూరంబు
లెఱింగించెద.

## విద్రుమ ధారణగుణము

కం॥ దాసన పువ్వు మెఱుంగున
భాసుర మగు విద్రుమములు బహుశ్రేష్ఠమగున్
భూసుతునకు నివి హితమగు
నా సక్తిని దాల్చువారి కబ్బును శుభముల్ ॥

వ॥ వెండియు.

## విద్రుమ శుద్ధి

కం॥ రుద్రప్రసవ సమంబగు
విద్రుమములు శ్రేష్ఠమనియు వెరవుగ నవి నిం
బద్రవమున నిడి జలముల
తద్ద్రవరహితంబు జేయ తగు శుద్ధి యగున్ ॥

తే॥ ఇల్లు శుద్ధి యొనర్చి మఱియునంత,

## విద్రుమ భస్మవిధి

గీ॥ భౌమహితమైన రత్నముల్ పంకజాప్తు
పయములును గూర్చి మర్దించి పటుశరావ
ములను స్థాపించి మాతంగ పుటము వేయ
భూతియొప్పును హరుమేని భూతియనగ ॥

వ॥ ఇంక మౌక్తికక్రమం బెఱింగించెద.

## మౌక్తిక ధారణగుణము

కం॥ రిక్కల డాలు మెఱుంగున
నక్కజమగు* చినుకుబూసలవి మేలొసగున్
రిక్కలరేనికి హితమగు
జిక్కగఁ దాల్చినను లేమి చేరదు నెందున్ ॥

---

*చినుకు బూసలు = ముత్యాలు

## మౌక్తిక శుద్ధి

కం॥ మౌక్తిక ఫల మూలంబున
శుక్తిక ? దళ రసముచేత సుస్థిరతజ్ఞాల్ ॥
మౌక్తికముల నిడ నవి శా
స్త్రోక్తిని నిర్దోషముగుచు నొగిరాజిల్లున్ ॥

## మౌక్తిక భస్మ

గీ॥ శుద్ధి జేసిన ముత్యముల్ శుద్ధబృంహ
ఫలరసంబున మర్దించి భవ్యగుణులు
నది శరావములో నిడి యవని పుటము
వేయ భసితంబు నగు దుగ్ధ ఫేన మనఁగ ॥

వ॥ ఇంక వజ్రక్రమం బెఱింగించెద.

## వజ్రధారణ గుణము

కం॥ కవి హిత రత్నము దాల్చిన
పవిధారి సమానకీర్తి బరగుదురు మఱిన్
కవి శిష్య యతుధాకిని
నివహాములును వెఱచు దాని నిజతేజమునన్ ॥

## శ్రేష్ఠ వజ్రలక్షణము, శుద్ధి

గీ॥ ధగధగ ద్దీప్తిచేతను తపనుమాడ్కి
ప్రజ్వరిల్లిన వజ్రంబు భవ్యమంత్రము
నదియు గంధర్వ జలముల నారుజాలు
స్థాపితము జేయ శుద్ధియౌ జగతిలోన ॥

## వజ్ర భస్మ

గీ॥ వజ్రవల్లీ రసంబును వజ్రములును
భావితము జేసి క్రమ్మర వజ్రమూష
నిడియు గజపుట మిడినేని గడియలోన
భూతియగు సప్తరూపవిభూతి యగునఁగ ॥

## మరకత గుణము

కం॥ హరి కరుణాప్రభ కెదురుగ
మరకత మిడెనేని దిశలు మార్పడి వెలుగున్
మఱియదియు నుత్తమంబగు
ధరియించిన పైత్యరుజలు దాఁకవు యెపుడున్

## గరుడ పచ్చ శుద్ధి

గీ॥ దిరిసెన విరులచాయనుఁ దేజరిల్ల
గరుడపచ్చలు మఱి వల్లికందమునను
మాటి నేర్పుగ వైచి రేమన్ను లిచ్చి
తామ్రమూఁడ పుటంబిడఁ దనరు శుద్ధి ॥

## గరుడపచ్చ భస్మ

గీ॥ శుద్ధిజేసిన పచ్చలు క్షుద్రరసము
గోలిమిడి పసరుచేతను గూర్చి నూరి
మూషలో నిడి వారణపుటము వేయ
భూతి యగునది ధూసర భాతిరీతి ॥

## నీలగుణము

గీ॥ నీలపుష్ప సమానమై నెగడెనేని
నీల మది శ్రేష్ఠ మని యింద్రు నిక్కమనఁగ
హరికుమారుని కధిప్రీతి యగును దానిఁ
దాల్చిరేనియు భూతముల్ దాఁకవెపుడు ॥

## భస్మ విధి

గీ॥ ఖరకర కుమార హితమణి కర జలముల
స్థాపితము జేసి తివిసియుఁ దడయ కపుడు
పుత్ర జననీ రసంబున పొంకుపరచి
హస్తి పుట మిడెనేనియు నమరుభూతి ॥

వ॥ ఇంక పద్మరాగక్రమం బెఱింగించెద.

పద్మరాగ లక్షణము, గుణము.

కం॥ కెందమ్మియు మందారము
బంధూకాశోక లోధ్ర పల్లవములలో నాఁ
సుందరత, నొప్పి దినమణి
చందంబున వెల్గు కెంపు సహజం బవనిన్ ॥

గీ॥ పద్మరాగంబుఁ దాల్చిన ప్రాజ్ఞునకును
పద్మనీ హితుఁడిచ్చును ప్రౌఢి మెఱయ
మనము సంపత్తి భూతియు మఱియు నెపుడు
పద్మమందిర యతనింటఁ బాయకుండు ॥

పద్మరాగ శోధనము

గీ॥ పరగ పికనేత్ర సమములౌ పద్మరాగ
ములును సైంధవ జలముల మూఁడునాళ్లు
స్థాపితము జేసి మఱి యుష్ణసలిలమునను
క్షాళితము జేయ శుద్ధియౌ తత్క్షణమున ॥

పద్మరాగ భస్మము

గీ॥ భాను హితమైన రత్నంబు భానుదుగ్ధ
ములను మర్దించి సామజ పుటములిడఁగ
భస్మమౌ నది కాంచన భసిత సదృశ
కాంతి నది గొన్న వాతనికాయమణఁచు ॥

వ॥ ఇంక పుష్యరాగ క్రమం బెఱింగించెద.

పుష్యరాగ లక్షణము, గుణము.

గీ॥ కర్ణికార ప్రసూనంబు కాంతి దనరు
పుష్యరాగము శ్రేష్ఠమౌ పుడమిలోన

నిర్జరగురుండు కడుప్రీతి నెగడు దానిఁ
దాల్చిరేనియు గదబాధ తాఁకదెపుడు ॥

## పుష్యరాగ శుద్ధి భస్మము

గీ॥ పుష్యరాగము గోమూత్రమునను నిడిన
పరమ శుచి బొందు మరికల్వ పగతురసము
చేత మర్దించి పుటమిడ శీఘ్రమునగను
భసిత మొప్పును ధూసర ప్రభనుబోలి

వ॥ ఇంక గోమేధిక క్రమం బెఱింగించెద.

## గోమేధిక లక్షణము, గుణము.

కం॥ గోమూత్ర సన్నిభం బగు
గోమేధిక మే జనుండు కోరి ధరించున్
వేమారు కేతు వెప్పుడు
నేమరక శుభంబు లిచ్చు హితవైయుండున్ ॥

## గోమేధిక శుద్ధి

కం॥ ద్విజహిత రత్నము నేర్పగ
గజవారిప్లద్రవంబు గంధర్వజలం
బుజతను జేసిన యంతనె
నిజముగ సచ్ఛుద్ధియం్రదు నేర్పరులిలలోన్ ॥

## గోమేధిక భస్మము

కం॥ కేతుహిత రత్నమునుఁదా
మాతుల రసమున ఘటించి మర్దించి యదిన్
నా తపము నార్చి పుటమిడ
భూతి యగున్ ధూమరీతి భూతలమందున్ ॥

వ॥ ఇంక వైడూర్యక్రమం బెఱింగించెద.

## వైడూర్య లక్షణము గుణము

గీ॥ సలలిత బిడాల నేత్రాభ సైంహికేయ
విహితరత్నము దాల్చిన మహితలమున
వారికెన్నడు వృశ్చికవ్యాళ సమితి
విషములునుఁ దాఁకవని యంద్రు విశదముగను ॥

## వైడూర్య శుద్ధి

గీ॥ పిల్లికన్నురీతి పృథుకాంతి వైడూర్య
మశ్వమూత్రమునను నమరనిడియు
బరువడి కకుభాండ ఫలరసంబుననిడి
తివియ శుద్ధి బొందు తీవ్రముగను ॥

## వైడూర్య భస్మము

గీ॥ రాహుపునకు ప్రీతి రంజిల్లు రత్నంబు
నశ్మభేదరసము లనుకరించి
భావితంబు జేసి వజ్రమూషను నిడి
దంతి పుటము వేయఁ దనరు భూతి ॥

గీ॥ శ్యామఖల్వంబులో సూర స్తత్వమొసఁగు
శ్వేత ఖల్వాన బలము నశించు మఱియు
పీతఖల్వంబు రుజల కప్రీతిఁ జేయు
ధాతు ఖల్వంబు దోషత్రి తాపమణచు ॥

కం॥ పతిహిత భక్తియుగలిగిన
సతియైనను మఱియు సత్యసంధుండైనన్
శతమన్యు దిక్కు ముఖమున
నతిహిత మగు నూరెనేని నదిగుణ మిచ్చున్ ॥

కం॥ *ఒంటమి గలవాఁడైనను
కుంటెనకాఁడైన మఱియుఁ గుత్సితుఁడైనన్

*ఒంటమి = వైరము

కొంచెతనంబున వైద్యుని
కంటక పడువాఁడు నూరఁగడఁకీడవనిన్ ॥

కం॥ సర్వభైషజ్యములకును జగతిలోన
వంశనాళంబు నిడికేని వర సుటంబ్రడు
శృంగ నాళంబు నటితి షతంగలోహం
కాంస్య పాత్రల నుంచిన కలుషమాంద్రు

గీ॥ కమలపాణిమిత్ర ! కమలసంభవసుత !
కమల హితకులాబ్ధి కమలశత్రు !
కమల మిత్ర తేజ ! కమల సన్నిభహస్త !
కమల పత్రనేత్ర కమలనాభ !

## గద్య

ఇది శ్రీ రామచంద్ర చరణారవింద ధ్యాన హృదయప్రదీప సకలసుకవిజన విధేయ ధేనుకొండ జోగినామాత్యపుత్ర భిషక్ఛాస్త్ర ప్రవీణ కేశవ నామధేయ ప్రణీతంబైన వైద్యచింతామణి ద్వితీయాశ్వాసము సంపూర్ణము

ఇది ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము

కం॥ శ్రీ కౌసల్యానందన !
కాకుత్స్థ కులప్రదీప ! కలుషవిదూరా !
పాకారిప్రముఖ ను(త)తి వ
శీకర ! సాకేతధామ సీతారామా !

వ॥ అవధరింపుము.

కం॥ ఘోరమగు రోగ మనియెడి
పారావారంబు దాట పథ్యం బనఁగా
నేరుపుగ నావ జేసెద
ధారుణి సద్వైద్యు లెల్లఁ దద్దయు మెచ్చన్ ॥

వ॥ రసభాగ్ని కుమారంబును, లోహాగ్ని కుమారంబును, రత్నాగ్ని కుమారంబును, సిద్ధాగ్ని కుమారంబును, లఘ్వాగ్ని కుమారంబును, మహాగ్ని కుమారంబును, ప్రతాపాగ్ని కుమారంబును, ప్రాణాగ్ని కుమారంబును, దివ్యాగ్ని కుమారంబును, ఉత్తమాగ్ని కుమారంబును, నాదిగాఁ గల్గు దశవిధ కుమారంబు లెఱింగించెద.

## రసభాగ్ని కుమారము

మ॥ హారి భస్మంబును వత్సనాభియును లోహంబచ్ఛ
గంధంబు శం
కరురేతంబు త్రిపాదసారమునచే ఖల్వంబునన్ నూరియున్
నరయంగాఁ బదిరెండుఁ జాలు సికతాయంత్రంబుచే
వండినన్
జిరవైద్యుల్ రసరాజచంద్రు రుజలన్ చెండాడు ధాత్రీ
స్థలిన్ ॥

కం॥ రసభాగ్ని కుమారము భువి
మసలకయే రోగమునకు మాషద్విగుణం
బొసఁగిన తత్ క్షణమాత్రన
గసిబిస గావించు దీనిఁ గడు సత్వమునన్ ॥

## నవలోహాగ్ని కుమారము

సీ॥ కలధౌత కాంచన కాంస్య పన్నగలోహ
భాస్కర పిత్తళ పారదములు
సమ భాగములు గూర్చి జలజ మిత్ర ద్రవ
వారి చేతను నైదు వాసరములు
కజ్జలంబుగ నూరి గాజు మూసను నిడి
సికత యంత్రంబున స్థిరతగుణులు
పండ్రెండు జాములు వండి చల్లార్చియు
వల్ల ద్వయంబిడ వలయునంత

సన్నిపాతని కాయంబు సంహరించు
జ్వరములనుఁ ద్రుంచు మిక్కిలి జవమొసంగు
మహిని నవలోహ వహ్ని కుమార మనఁగఁ
బరగు దీని ప్రభావము దరమె యొంచ ॥

## రత్నాగ్ని కుమారము

సీ॥ కురువింద మౌక్తిక మరకత హరినీల
పీతరత్న మభేద్య కేతుమణులు
భౌమరత్నమును స్వర్భాను రత్నంబును
సరిభాగములు గూర్చి మఱియునంత
లవణోత్తమము ఖండలవణంబు రుచికము
లవణంబు మఱి కాచ లవణమునను
సర్వజ్ఞ రేతంబు సమభాగములు గూర్చి
వారుణమూల ద్రవంబుచేత

---

" త్రిగుంజో వల్లః ఉచ్యతే " మూడు గురువింద గింజల యెత్తు వల్లము

పీతిపటోత్ర రసంబు చేతను పలుమారు
మూఁడేసి దినములు ముఖ్యముగను
మర్దించి యార్చియు మఱి గాజుకుప్పిని
నమరించి వాలు కాయంత్రమునను

నాఱు జాములు వండి చల్లార్చియదియు
గుంజ మాత్రంబు సేవింప ఘోరమైన
సన్నిపాతములను ద్రుంచు సత్యముగను
మహిని రత్నాగ్ని యనెడి కుమారమిదియు ॥

## సిద్ధాగ్ని కుమారము

సీ॥ వసనాభి గంధ సౌభాగ్య పారంబులు
సమభాగములు గూర్చి చతురముగను
ఖద్యోత పయముల కజ్జలంబుగ నూరి
వరగుణ లదియును వజ్రమూష
నిడి భాండమునయందు తడవుచేయక ముందు
సూక్ష్మవాలుక మిడి చోద్యముగను
తమ్మూష నిడి మఱి ధాత్రిపుటంబిడి
చల్లార్చి తివిసియు జాణయగుచు

గీ॥ సములు నాల్గు నొసఁగిన విశదముగను
సంహరించును జ్వరముల సన్నిపాత
ములను ద్రుంచును జఠరాగ్ని గలుగఁజేయు
నవనిలోనిడి సిద్ధాగ్ని యనఁగఁబరగు ॥

## లఘ్వగ్ని కుమారము

సీ॥ తిలసంభవము శిల బలి రుద్ర రేతముల్
మృత్యు భూషణమును సేర్పువిూర
నతులిత మొనరించి హంస పాదికరసం
బమరించి మర్దించి యార్చియంత

క్రమ్మర నదియును గాజు కొప్పెర నిడి
సికత యంత్రంబున స్థిరత గుణులు
షడ్యామములు వండి చల్లార్చి వెనుకను
గంజెత్తు పూటకుఁ గొనిన వేగ

ప్రాఁత వేఁకులఁ బరిమార్చు బహుగతులును
శైత్య ముడిగించు మిక్కిలి సత్వమిచ్చు
మహిని లఘ్వగ్ని యనఁబడి కుమార మిదియు
దీనిఁ బొగడ ధన్వంతరికైనఁ దరమె ||

మహాగ్ని కుమారము

సీ|| దగ్ధ పాషాణము ధూర్జటిరేతంబు
హాలాహలంబును హరివిభూతి
గగన భసితమును గంధక దరదంబు
పత్ర తాళకమును బరగఁ గూర్చి
*మార్కవ రసమున మర్దించి యొకజాము
నొప్పగా నది గాజు కుప్పెనిడియు
భావజ్ఞు లంతట భాండాన సికతయు
శాస్త్రోక్తముగ నిడి చతురముగను

నందుఁ దన్మాత్ర నిడి కమలాగ్ని చేత
నొకటి దివసంబు వండిన నుక్కు మిగిలి
సన్నిపాత జ్వరంబులఁ జక్కఁజేయు
మహిని దీని మహాగ్ని కుమార మండ్రు ||

ప్రతాపాగ్ని కుమారము

సీ|| భానులోహ విభూతి ఫాలాక్షు రేతము
హాలాహలంబు విశ్వౌషధమును

*మార్కవము = గుంటగలిజేరు
కమలాగ్ని : అగ్నులు దీప, కమల, గాధాగ్నులని మూడువిధములు

తీక్ష్ణ మూషణమును త్రిక్షార పటుపంచ
మూలఁ గూర్చి యార్ద్రిక సలిలములను
మర్దించి లెస్సగా మఱి గాజు మూషలో
నమరించి శర్కరా యంత్రమునను
*... ... ... ...
విరవిగా కమలాగ్ని వేగించి యొకనాడు
విషము దశభాగ మొనరించి విశదముగను
వల్ల మాత్రంబు నిడ నుష్ణవర్గ మణఁచు
మహిని యిది ప్రతాపాగ్ని కుమారమంద్రు ॥

ప్రాణాగ్ని కుమారము

సీ॥ భూతేశ రేతో విభూతియుహాభూతి
హాలాహలంబు కుష్మాపహారి
భాగముల్ సరిగూర్చి పర్పటరసమున
భావితం బొనరించి వజ్రమూష
నిడి నేర్పు మీఱఁగఁ బుడమి పుటంబిడి
చల్లార్చి తివిచి తత్సదృశముగను
ఝష భేక మాయూర ఛాగతిక్తంబులు
ఘటియించి నూరియు లగ్జలముగ

గుంజమాత్ర ప్రమాణంబు ఘుటికఁజేసి
యిడినయంతనె జ్వరముల నడుగఁజేయు
నవనిలోపల ప్రాణాగ్ని యంద్రు దీనిఁ
దెలియ శక్యంబె యాశ్వినేయులకునైన ॥

దివ్యాగ్ని కుమారము

సీ॥ పారదభసితంబు వసనాభి సరిగూర్చి
యగ్ని రసంబున నమరనూరి
వజ్రమూషను నిడి వాలుకాయంత్రంబు
నందు సంఘటియించి యవనిపుటము

*ఇచ్చట రెండు చరణములు పోయినవి

వేసి చల్లార్చియు వెరవుగా నొకజాము
యూమణ రసమున నొనర నూరి
వసనాభి నాఁవ భాగంబు మఱి యిడి
చాండాలి పల్లవసారమునను
మర్దితము జేసి యఱచిన్న మాత్ర మిడిన
నద్భుతంబుగ జ్వరముల నణఁగజేయు
మహిని దివ్యాగ్ని యనెడి కుమార మిదియు
దీని గుణమెన్న బ్రహ్మకునైన దరమె!

ఉత్తమాగ్ని కుమారము

సీ॥ మారారివీర్యభస్మమ్ముఁ గను సమ్మతము
గౌరిసంభవభూతి కాంతభూతి
ఖడ్గలోహవిభూతి ఖరకరలోహంబు
నతులిత మొనరించి హంసపాది
పత్రసారంబున భావన గావించి
గాజుమూసను నిడి క్రమ్మఱదియు
శర్కరా యంత్రాన సమకొల్పి పద్యామ
ములుఁ వండి చల్లార్చి ముఖ్యముగను
నాలుగు విసఁబు లిడివేగ నారికేళ
వారి, శర్కర మఱి యిక్షుసార మిడిన,
నుష్ణములు బాపి భువిలోన నుత్తమాగ్ని
యనగఁ జెల్లును నిది కొనిచూడఁ దరమె॥

వ॥ మఱియును సంధికంబునకు భూతభైరవంబును, అంతకంబునకు విజయ భైరవంబును, రుద్గాహకంబునకు సంగర భైరవంబును, శీతాంగంబునకు విదారుణభైరవంబును, రక్తష్ఠీకంబునకు సన్నిపాత భైరవంబును, ప్రలాపంబునకుఁ గారుణ్యభైరవంబును, జిహ్వకంబునకు సిద్ధభైరవంబును,

అభిన్యాసంబునకు కరవాల భైరవంబును, నాదిగాఁ గల్గు త్రయోదశ సన్నిపాతంబులకు భైరవ త్రయోదశంబు లెఱింగించెద.

భూత భైరవి

గీ॥ భర్గురేతోభూతి భాస్కర లోహంబు
శరభూమిజము గూర్చి సమమువహ్ని
సారంబుచే రెండుజాలు మర్దనఁజేసి
వజ్రమూషను నిడవలయు నంత
శర్కరాయంత్రము సమకూర్చి యొకవాస
రము వండి కృష్ణమార్జాలతిక్త
మును ఘటించియుంచియు మూఁడుజాములు నూరి
తువరి మాత్రమౌగాని తూర్ణముగను

జలముతైనను ముక్కంటి జలముతైనఁ
గ్రోలి పాయసమన్నంబు గోరసంబు
నారగించిన సంధికం బణచు నిదియు
భూతభైరవ మనఁజెల్లు భూతలమున ॥

క౦॥ శ్రీ సౌభాగ్య భవత్వస్తు,
వాసవరిపు చక్రహారియు వాయుసుమిత్రుం
బొసఁట గూర్చి క్రమంబుగ
వీసం బిడనేని సంధివికృతి హరింపున్ ॥

విజయ భైరవి

చం॥ గురుభసితంబు నంబరము కుండలిభూతియుఁ గాలకూటమున్
గఱిదనుజారి శుక్లమును ఖల్వములోఁ ద్రికటుద్రవంబుచే
మఱి మఱి రెండు జాములును మర్దన జేసియు వజ్రమూషలో
స్థిరముగ నుంచి కుంభమున *సిక్తము యంత్ర మొనర్చి వండియున్

తువరి = కంజెగింజ. *సిక్తము = సికత (ఇసుక)

వెరవున శ్వానతిక్తమున పీసము గొన్న హరించు హంతకం
బరయంభిషజ్ఞులల్ విజయాభైరవి యందురు దీని ధారుణిలో॥

సంగర భైరవి

సీ॥ త్రిపురారి రేతంబు త్రిక్షారములు మఱి
యరకలోహవిభూతి యాయసమును
గటుపంచ రసమునఁ గజ్జలంబుగ నూరి
డెందంబుగా వస్త్రమందు గట్టి
పంచకోలరసంబు భాండమునందిడి
యంతట డోలికా యంత్రమునను
దప్తంబు గావించి తత్క్షణంబున కోడి
చేదుచే నూరియు శీఘ్రమునను

మాగధీ చూర్ణమునఁ గూర్చి మాషమెత్తు
నార్ద్రమున తోడ సేవింప నాక్షణమున
నణఁచు రుగ్దాహమును నన్ని నవనిలోనఁ
బరగు నామంబు సంగర భైరవనగ ॥

మదన భైరవి

సీ॥ లవణోత్తమము శిల రక్తలోహ విభూతి
పశుపతి రేతంబు బలిసమాంశ
మిడి *క్షుద్రరసమున కడు భావితము జేసి
వజ్రమూషను నిడి వసుధపుటము
వేసి చల్లార్చియు వెరవుగా గోతిక్త
మున జాము మర్దించి ముఖ్యముగను
ముక్కంటి నీటను మూఁడు పీసంబులు
నొసఁగియు దధ్యన్న యుక్తముగను

పథ్య మొనరించి రేనియు వసుధలోనఁ
జిత్త విభ్రమమునుఁ ద్రుంచు శీఘ్రమునను

క్షుద్రరసము = తేనె

మదన భైరవి యనెడి నామాంకితంబు
నమరు దీని ప్రభావము నలవె యెంచ ॥

ఆనంద భైరవి

సీ॥ స్థాణు శుక్ల విభూతి సౌభాగ్య దరదము
తరణి లోహవిభూతి తాళకమును
పన్నగైశ్వర్యంబు వంగవిభూతియు
శస్త్రలోహ విభూతి సమమొనర్చి
వరకషాయంబునఁ బర్పటిరసమున
యామద్వయము డోలికాఖ్యయంత్ర
మున వండి ఫణిపిత్తమున నూరి నేర్పుగా
గుంజెత్తు పూటకుఁ గొనియు వేగ

గోరసాదనమునుఁ దిన ఘోరమైన
శీతగాత్రము హరియించు శీఘ్రముగను
బరగు నామంబు నానంద భైరవియన
నవని దీనిని నెన్నంగ నజుని తరమె ॥

గీ॥ రాజభూతి, రాజరాజ మిత్రుని మేఁత
రాజపుత్రి సూతరాజహంస
రాజ వృక్షమూల రసముచేతను వీస
మాత్ర మిడిన శీతగాత్ర మణఁచు ॥

మనో భైరవి

సీ॥ లవణంబు నుత్తమ లవణంబు మటికృష్ణ
లవణంబు కాచకలవణమునను
స్వర్చక యవభూతి సౌభాగ్యమును దామ్ర
పాద రసముల సద్భసితములును

రాజరాజ మిత్రుని మేఁత = శివునియన్నము అనగా నాభి

భాస్కరమూల ద్రవంబుచే మూన్నాళ్లు
భావితం బొనరించి వజ్రమూష
యందు సంఘటియించి యూర్ధ్వోత్తములు సిక్త
యంత్రంబుచే వండి యంతమీఁద

గార్దభముపిత్తమును గూర్చి కజ్జలముగ
భావితముజేసి తేనెతోఁ బాతికెత్తు
నిడిన తాంద్రికమును ద్రుంచు గడియలోనఁ
బరగు భువిలోన నిది మనోభైరవి, యన ॥

స్వచ్ఛంద భైరవి

సీ॥ వసనాభి గరళంబు వంగవిభూతియుఁ
దిలసంభవంబును బలియు రసము
సరిగూర్చి నేర్పుగా వరకషాయంబున
మర్దించి యార్చియు మఱియు డోలి
కాఖ్యయంత్రంబుచే యామద్వయము వండి
చల్లార్చి మఱి దాని సదృశముగను
గ్రోడ పిత్తంబునఁ గూర్చి భావనఁ జేసి
మాషమాత్రము రేపు మాపు నిడియుఁ

గలుపు నన్నంబు చల్లని సలిలములును
నార్ద్రికంబును పథ్య మిట్లాచరింపఁ
గంఠకుబ్జక మను సన్ని గర్వమణఁచు
నమరు స్వచ్ఛంద భైరవ మనఁగభువిని ॥

కల్యాణ భైరవి

సీ॥ గరళంబు గంధంబు గరళకంధరశుక్ల
భసితంబు ద్రవుభూతి వత్సనాభి
కాకోదర విభూతి కణసమాంశముగూర్చి
యగ్నిరసంబున నమర నూరి

వజ్రమూషను నిడి వాలుకాయంత్రము
సంఘటించియు ధనంజయునిచేతఁ
బ్రహర చతుష్కంబు పచనంబుగావించి
తాఁబేటిచేదును దగ నొనర్చి

త్రిపుటమాత్రము నొసఁగినఁ దీవ్రముగను
పాలు శర్కర దధితోడ పథ్యమిట్టు
లాచరించిన కర్ణికం బణఁచుదీని
పేరు కొనియాడ కల్యాణ భైరవంద్రుఁ ॥

## విదారుణ భైరవి

ఉ॥ సారసమిత్రులోహమును స్థాణుని శుక్లవిభూతి వంగముల్
సారసనాథ మిత్రుఁడునుసాపడు వస్తువుతోఁడ నెంతయున్
*సారసమిత్ర దుగ్ధముల జానుగ మర్దనఁజేసి వీసముల్
గూరిచి యేణపిత్తమునఁ గొన్న హరించును భగ్ననేత్రముల్
ధారుణిలోన నెన్నఁగవిదారుణ భైరవియంద్రు సద్గుణుల్ ॥

కం॥ హరి శ్రీహరి హరసుతబలి
హరి పయములచేత నూరి హరిపిత్తముతో
నరచిన్న మాత్ర మొసఁగిన
హరియించును భగ్ననేత్ర మాశ్చర్యమునన్ ॥

కం॥ *గాడుపు తండ్రి విభూతియు
గాడుపు చెలిలోహభూతి గాడుపు భక్ష్యం
గాడుపు సంగడి రసమునఁ
గూడి యొసంగినను గంతకుబ్జము ద్రుంచున్ ॥

## సన్నిపాత భైరవి

సీ॥ ఉగ్రాంతమును బలియురగంబు గగనంబు
విషము సౌభాగ్యము విశదముగను
వటపయంబులు నూరి ఘటికాత్రయము డోలి
కాఖ్యయంత్రంబున నమరవండి

---

గాడుపు దండ్రి విభూతి = అభ్రకభస్మము, గాడుపు చెలిలోహబూతి = తామ్రభస్మము.

సారస మిత్ర దుగ్ధములు = జిల్లేడుపాలు

మాయూర మాహిష మత్స్యపిత్తంబుల
భావనగా వించి భవ్యముగను
వైదేహిరసమున వల్లద్వయంబిడి
గంతనే, రక్తపిత్త నణఁచు మాత్రయు

ద్వంద్వరుజలనుఁ బరిమార్చుఁ దత్క్షణమున
జగతిఁగోపల నిది మహాసన్నిపాత
భైరవి యటంద్రు దీని ప్రభావ మెన్నఁ
దరమె కమలాసనునకైనఁ దరచిచూడ!

సీ॥ నాగకంకణ కేతంబు నాగము బలి
నాగదనుజారి భక్ష్యము నాగభూతి
నాగ కుసుమంబు నాగంబు నాగరమును
నాగభుక్ పిత్తమును నెలనాగ పాల,
నాల్గు జాములు మర్దించి నాగవల్లి
దళరసంబున సేవింపఁ దత్క్షణమున
నాగ మణియొసి రక్తపిత్త రోగమునకు
నాగవరకు పతాకమునాఁగఁ బరగు ॥

కారుణ్య భైరవి

గీ॥ నింగి సర్వజ్ఞ కేతముల్ భృంగసార
మునను మర్దించి యది గాజు మూష నిడుచు
సికతయంత్రముచే వండి శీఘ్రముగను
కోల శిఖిపిత్తములు గూర్చి గుంజయెత్తు
నొసఁగి ముక్కంటి నీటను మొసఁగి చల్ల
సాదమును, గుడువ ప్రలాపసంధి నణఁచు
వసుధయందును గారుణ్య భైరవనగ
నహాహా కొనియాడ శక్యమే మృడునికైన ॥

## సిద్ధ భైరవి

శుద్ధిఁ జేసిన కాంచన ప్రభ సూతముల్ తిమిపిత్తమున్
వృద్ధవైద్యులు కన్యరసమున వీసమెత్తు నొసంగినన్
సిద్ధమియ్యది జిహ్వదోషము శీఘ్రమే పెడబాపునీ
సిద్ధ భైరవి దంతిరుజలకు సింహ మంద్రు జగంబునన్ ॥

కం॥ చతురముగ సిద్ధ భైరవి
నతులితముగఁ గృష్ణఁగూర్చి యరచిన్నంబున్
సతతము క్షౌద్రముతో నిడ
హతమగు మోహాదిరుజలు నద్భుత మొప్పన్ ॥

## కరవాల భైరవి

సీ॥ భూతేశ రేతంబు భూతనాశనమును
త్రిక్షారములు మఱి త్రికటుకములు
గంధమాదనమును గరళంబు త్రిఫలముల్
పంచాగ్నులును *గటుపంచములును
భానుపయంబుల భావన గావించి
యామద్వయము సిక్త యంత్రమునను
సూక్ష్మాగ్నిచే వండి శునిపిత్తమును గూర్చి
కురువింద మాత్రము గొనియు వేగ
నారికేళ జలంబుల నాని మఱియు
దధియు వంటకమును గొన్నఁ దత్క్షణమున
సంహరించు నభిన్యాస సన్ని నవనిఁ
బరఁగు చెప్పుడు కరవాల భైరవి, యన ॥

కం॥ కుండలి రాడ్భూషణసుతుఁ
గుండలి కుండలి విషంబు గూరిచి సూతన్
గుండలి దళరసమున నిడఁ
జెండు నభిన్యాస సన్ని సిద్ధము, ధరణిన్ ॥

---

*పటుపంచములని పాఠాంతరము

వ॥ మఱియు భూతేశ్వర రసంబును, త్రిపురాంతక రసంబును, శాంభవీ రసంబును, భద్రకాళీ రసంబును, భువనేశ్వరీ రసంబును, ఉమామహేశ్వరీ రసంబును, నారసింహ రసంబును, విశ్వంభర రసంబును, గరుడధ్వజ రసంబును, భార్గవ రసంబును, నారాయణీ రసంబును, వైష్ణవీరసంబును, లక్ష్మీనారాయణ రసంబును, హిరణ్యగర్భ రసంబును, కమలాసన రసంబును, పితామహ రసంబును, భారతీ రసంబును, కల్యాణ రసంబును, శరభేశ్వర రసంబును, వీరవిక్రమ రసంబును, త్రివిక్రమ రసంబును, జయవిక్రమ రసంబును, రసేంద్ర రసంబును, మహేంద్ర రసంబును, లోకేశ్వర రసంబును, రసరాజ రసంబును, కాలభైరవ రసంబును, సూచికాముఖ రసంబును, సూచికాభరణంబును, ప్రాణేశ్వర రసంబును, మృత్యుంజయ రసంబును, మృతోత్థాపన రసంబును, యోగినీ రసంబును, బ్రహ్మాస్త్ర రసంబును, అఘోరాస్త్ర రసంబును, భూతేశ్వర రసంబును, పాశుపతాస్త్ర రసంబును, గరుడ రసంబును, మృతసంజీవినీ రసంబును, ధన్వంతరి రసంబును, ఫణిభూష రసంబును, సన్నిపాత దవానల రసంబును, రోగభంజన రసంబును, పాణిబుకారరసంబును, ఏకమూర్తి రసంబును, ద్విమూర్తి రసంబును, త్రిమూర్తి రసంబును, చండభాను రసంబును, సురపాక రసంబును, శీతగజాంకుశ రసంబును, భవనాథ రసంబును నాదిగాఁ గల్గు షష్టి రసౌషధంబు లెఱింగించెను.

కం॥ భూతముఁ బ్రోచి రుద్రుఁడు
భూతేశుఁ డనంగఁ జెల్లె భూతలమందున్
భూతేశ రసము నటువలె
భూతాత్మకమైన మేను బ్రోచుటచేతన్ ॥

సీ॥ ఖట్వాంగధర వపుః కాంతకూటంబు మఱి
మణి రాగమును గంధమాదనమును
దంతిబీజంబులు దగఁగూర్చి వహ్నిక
షాయంబుచే నాల్గుజాలు డోలి
కాఖ్య యంత్రంబుచే నమరంగ నడి వాడి
మత్స్యపిత్తము గూర్చి మఱియు వజ్ర
పయములచే నూరి పరకేత్తు నార్ద్రిక
సారంబుచేకొన్న జ్వర మణంచు

శర్కర మూల కషాయమునందు నిడుచుఁ
గలుపు నన్నంబు నిడ సంధికంబణాచు
సప్తవిధ దోషములఁ ద్రుంచు సత్యముగను
ధరణిగోపాల భూతేశ్వరరసమండ్రు ॥

కం॥ త్రిపురములు ద్రుంచి భర్గుఁడు
త్రిపురాంతకుఁ డనఁగబరగె త్రిపురము లనఁగా
యపుదోషములవి ద్రుంచుటఁ
ద్రిపురాంతక రస మనంగఁ దీవ్రత నొప్పున్ ।

సీ॥ గిరిజసంభవ నూతి శరభూతి యజరుద్ర
ధాతు భస్మంబులుఁ దగనొనర్చి
భృంగరసంబున మృసుపుగా రోకవాస
రము నూరి మూషను నమరనిడియు
గహనోత్పల దళంబుఁ ఘటియించి పుటమిడ
తిమి భస్మ ఘోణి పిత్తములు గూర్చి
యామత్రయము నూరి యార్ద్రికరసమున
వల్లమాత్రము నిడవలయు మఱియుఁ

దక్రమన్నంబు శర్కరోదకము నొసఁగ
వాతకఫ పైత్య మాహికవర్గ మణఁచు

సంకరము ద్రవించు దవ్వగు జాసమితి
సహహా త్రిపురారి రసమెన్న నజుని కైన
నశ్వినులకు ధన్వంతరికైన వశమె ॥

కాలకంథర రసము

చ॥ స్మరహరవీర్య భూతియును జానకియున్ శిలయున్ దిలోద్భవన్
గరళము గంధమాదనము గాంచన బీజము లంసపాదిరన్
స్వరసము గూర్చి నూరి శతబాణపుటం బిడి చేప చేదునా
సరిగ నొనర్చి యంత స్మృహిసారముచే ఘుటికించి వీసమున్
చెరకురసంబుచే నిడ నశించును సాకర దద్రురోగముల్
సరసులు కాలకంధర రసంబని యం్రశదీ యెన్న శక్యమే ॥

గీ॥ పరకమాత్రము కాలకంథర రసంబు
నొసఁగి శాల్యోదనము ముద్గయూష మిడియు
నంతతృష్ణయైన యపుడె హిమామృతములు
నిక్షురసమును నొసఁగిన నక్షణమున
సందియము లేక పదమూడు సాధులణఁచు ॥

శాంభవి రసము

సీ॥ గౌరిపాషాణంబు గంధకంబును శౌరి
పురహారు రేతమ్ము పూతనమును
తూరంబు దంతి పంచాంకుళీ బీజముల్
తగఁ గూర్చి వాసరత్రయము లిరుచ
సారంబుచే నూరి చరణాయుధ పుటంబు
వేసి చల్లార్చి తద్భేషజమునకు
వల్లిజంబులు దశభాగంబు నిడె మఱి
హాలాహలంబు సమాంశ మిడియు

చరణాయుధపుటము = క్రక్కుటపుటము

చిత్రతైలముతో నూరి సిద్ధముగను
వల్లమాత్రము గొని దృఢఫల జలంబు
త్రావనేనియు జ్వరసంధి తాపములను
గసిబిసిగఁ జేయు శాంభవీ రసము భువిని ||

కం|| పెరుగును దృఢఫలజలములు
విరివిగ నిడి యంత శాంభవీ రస మొసఁగన్ ||
హరియించును సప్తవిధ
జ్వరముల నుప సన్ని సన్ని సంఘములనిలన్ ||

భద్రకాళీ రసము

సీ|| నిర్మలభస్మంబు నీలకంఠర శుక్ల
భసితంబు నాగరవల్లిజము‌ను
వైదేహి లవణోత్తమము కాలకూటము
కాంచన విజయముల్ గంధకమును
దగనిడి సిక్త యంత్రము కూర్చి *చూల్యపై
యామద్వయము కమలాగ్ని చేత
పచనంబు గావించి బరువడి జలచర
తిక్తంబుచే నూరి త్రిపుట మెత్తు

నొసఁగనేనియుఁ గాంతి నింపెసఁగఁ జేయు
దోషములు బాపు మిశ్రకదోష మణఁచు
శైత్యరుజలను బరిమార్చు జగతిలోన
భద్రకాళీరసం బసఁ బరగు నిదియు ||

గీ|| ఆయసముసఁ బరుస మంటిన స్వర్ణమా
నట్లు భద్రకాళియను రసంబు
జనుల కనవరతము జరమృత్యువును బాపి
చిఱుత జవ్వనంబు చేయు భువిని ||

---

*చూల్లి—పొయి

వ॥ మఱియును.

॥ శంబరివైరివైరిసుతు జానకి వల్లిజ విశ్వభేషజం
బంబర భూతి గంధకము నాటకబీజము సింధు టంకముల్
జంబురసంబుచేత నిడి జాము విమర్దనఁజేసి నేర్పుగా
నంబుజనేత్ర దుగ్ధముల యందిడి మామమిత్ర గొనంద
గన్

గీ॥ ఘనులు నిది యు భద్రకాళీరసం బాద్రు
పరకమాత్ర మిడినఁ బాయు రుజలు
దీని గుణము నెన్న దేవవైద్యులకైనఁ
గలశభవునికైన నలవె! యెంచ॥

## భువనేశ్వరీ రసం

గీ॥ విష్ణుపదవిభూతియును మఱి విష్ణుతేజము
మునకు నటి, గౌరి శిలయును భుజగవిషము
దంతి బీజములును గూర్చి తైక్ష్ణమున
కారవల్లీ రసంబున నూరి మఱియ

రావమున నిడిపని *యుత్పలములు కూర్చి
యగ్ని నిడి యంత చల్లార్చి యార్ద్రరసముఁ
గూర్చి గురుంవిద మాత్రము గొన్న నుష్ణ
సమితి నణఁచు నిది భువనేశ్వరి రసంబు॥

## ఉమా మహేశ్వరీ రసము

పంచచామరము.—

ఉమోద్భవం మనశ్శిలారసోద్భవం బలిం విషం
కుమారికారసం విమర్ద్య గుంజమాత్ర సేవితం
సమీరపైత్య శ్లేష్మరోగ నాశనం సుధీజనై
రుమామహేశ్వరీ రుమితం రసం మహీతలే॥

---

ఉత్పలములు = పిడకలు

## విశ్వంభర రసము

సీ॥ గగన విభూతి శంకరవీర్య భసితంబు
రససంభవమును భర్మ ప్రభంబు
హాలాహలము గూర్చి హంసపాది కషాయ
మున రెండుజాములు ముఖ్యముగను
మర్దించి యార్చియు మఱి శరావము నిడి
కుక్కుట పుటమిడి ఘోణి మత్స్య
తిక్తముల్ ఘటియించి త్రిదినముల్ మర్దించి
నాల్గువీసము లిడి నారికేళ

జలముతైనను నిమ్మరసంబునైనఁ
ద్రావనేవి రుజల్ సప్తధాతుగతము
లణఁచు సంధిక మూలఁద్రుంచు నక్షణమున
గోత్ర సన్నిభ రుజలకుఁ గులిశమనఁగ
నమరు విశ్వంభరరసంబు విమలముగను ॥

వ॥ మఱియును.

ఉ॥ పార్వతిసంభవంబు హరిపత్రము శంకర బిల్వజాతముల్
బార్వతినాథుశుక్లమును బన్నగభూతియుఁ గుండలీవిషం
బూర్వ త్రిపాదిసారముల మూఁడు దినంబులు నూరి వీసముల్
పూర్వమునందు నార్ద్రికము పుచ్చుకొనన్ హరియించు దోషముల్ ॥

కం॥ విశ్వౌషధరసమున నీ
విశ్వంభరరసము నొక్కవీసం బిడినన్
విశ్వంబునందు రుజలను
విశ్వంభరుఁ డనుక నణఁచువిధమున నణఁచున్ ॥

## నారసింహ రసము

మత్త కోకిల

పారదంబును దంతిబీజము వత్సనాభియు గంధముల్
సారసాప్త రసంబుచే *రిగిజాలు మర్దనఁ జేసి చె
న్నార డోలికయంత్రమున నొక యామ మాత్రము
వండియున్
నూరి గుంజద్వయము మొసంగిన నుక్కణంచు జ్వరంబులన్
ఘోరమైన సమీరశూలలఁ గూల్చు భూతలమందు నీ
నారసింహ రసంబు నెన్నఁగ నల్వకైనను శక్యమే ॥

## గరుడధ్వజ రసము

సీ॥ గంధమాదనమును గాలకూటము సింధు
తారాపథంబును పారదమును
మణిరాగమును కృష్ణమాగధి మూలముల్
స్వర్గప్రసూన విశ్వౌషధములు,
యవనేష్టమును గూర్చి యామచతుర్థంబు
నంసపాదిరసంబు నమర నూరి
కుక్కుట పుటమిడి గురువింద మాత్రము
నొసఁగనేనియు వేఁకి వెసఁదొలంగు

సంకటము ద్రుంచు జఠరాగ్ని చాల్రజేయు
దానవులకెల్ల విహగరాడ్ధ్వజుఁ డనంగ
దనరు రుజలకు గారుడధ్వజరసంబు ॥
.... .... .... ...

## భార్గవరసము

గీ॥ దంతిదనుజారిరేతంబు దంతిబీజ
ములును శరభూమిజముకూర్చి మూటగట్టి
*చలదళత్వక్కషాయము సరవిఁ గూర్చి
డోలికాయంత్రిమున రెండుజాలువండి

*గూడుజాములు
*రావి చెట్టు బెరడుతోఁ గాచిన కషాయము

## వైష్ణవీ రసము

గీ॥ కాలకూటము హింగుళ కటుక త్రికటు
సదృశములు కూర్చి నింబరసంబు చేత
యామమాత్రము డోలికాయంత్రమునను
వండి యార్ద్రికరసమున వల్లమాత్ర
మిడిన వాతాది కోష్ణములుడుగఁ జేయు
విశ్వమున నెంచు నిది వైష్ణవీ రసంబు॥

శా॥ శ్రీ చక్రాంగి మరీచ నాగర కణ శ్రీకంఠ రేతంబులున్
రోచిష్కేశ రసంబుచే త్రిదినముల్ రూక్షంబుగా నూరి
యున్
సూచ్యగ్రంబు వహించు నంత నిడినన్ జూర్ణంబుగాఁ
జేయునీ
త్త్మచక్రంబున, వైష్ణవీరసము శ్వాసద్వంద్వరోగంబులన్॥

## హిరణ్య గర్భరసము

సీ॥ సర్వజ్ఞరేతము చంద్రహాస విభూతి
భానులోహంబు ప్రవాళభూతి
కాంచనైశ్వర్యము కాంచన ప్రభముచు
కటుక మనోగుప్త గంధకమును
సజసగ్ధమును గూర్చి యాజుజాములునూరి
సామజపుటమిడి చతురముగను
ప్రహరమాత్రము నూరి వల్లద్వయం బిడ
వాతపైత్యంబుల వాసిఁ జెఱుచు

త్రివిధరోగోద్భవంబులఁ ద్రుళ్లణంచుఁ
గాంతి నిచ్చును జఠరాగ్నిఁ గలుగజేయు
నవనిలోపల రోగ భయార్తులకును
నిర్భయము జేయును హిరణ్యగర్భరసము॥

మాషమాత్రము మాగధి మాధవియునుఁ
గూర్చి యొసఁగిన నుష్ణముల్ కూల్చునిదియు
నవనిలోపల భార్గవమను రసంబు ॥

వ॥ మఱియును.

నాగరాక్షసాంత తేజ నాగతాళభస్మముల్
మాగధీ మణఃశిలీ సమాంశముఁ బోసంగియుఁ
నాగవల్లిపత్రమూన నాల్గుజాలు నూరియుఁ
రేగుగింజమాత్ర మెత్తు రేపుమాపు తేనెతో
నాగరంబుతో నొసంగ నాశమొందు నుష్ణహృ
ద్రోగ సన్నిపాతములును రూఢి భార్గవమ్మునన్ ॥

కం॥ తారము తారాపథమును
తారాపతిధరుని మేఁత తారాపతియున్
దారవిభూతియుఁ గూర్చి యు
దారత నిడెనేని యుష్ణతాపం బణఁచున్

నారాయణీ రసము

సీ॥ నటభూషణాభ్రముల్ కటుకయు కృష్ణయు
శరభూమిజము విశ్వమరిచములును
భావన గావించి పంచకోల క్వాథ
మున నూరి నేర్పుగా మూష నిడియు
భూధరపుటమిడ బుధసత్తములు బస్త
జంబుక పిత్తము సమమొనర్చి
గురువిందమాత్రము నురగవల్లి దళంబు
ద్రవమున నిడి రేవి తత్క్షణమున

సంహరించును సప్తదోష జ్వరముల
నాహికంబులఁ బరిమార్చు నద్భుతముగ
ఘోరగద జలధరాళికి మారుత మన
నమరు నారాయణీరసం బవనిలోన ॥

## కమలాసన రసము

గీ॥ కాలకంధరుఁ రేతమ్ము గంధకమును
కమలమిత్రుని లోహంబు ఖడ్గలోహ
భసితమును గూర్చి పిచుమంద పత్రసార
మునను మర్దించి యది గాజుకూప నిడియు,
వాలుకాయంత్రమున నాలు జాలువండి
వల్లమాత్రము నిడనేని వాతపైత్య
కఫములను బాపు ద్వంద్వజకాయ మణఁచు
సంకర మణంచును కమలాసన రసంబు॥

## పితామహ రసము

సీ॥ కనకప్రభంబును కటుకరోహిణియును
పారదోద్భవమును పారదమును
నాదిత్యలోహంబు నాయసంబును గూర్చి
యార్ద్రకరసంబున నమర నూరి
సిక్తయంత్రంబున శీఘ్రముగా వండి
గుంజమాత్రం బిడ, ఘోరమైన
మేహాదిరుజల సమేలంబు పెకలించు
ప్రాత వేఁకుల నెల్ల పారద్రోలు
సుప్తసంభవమును గూల్చు శోఫ లణఁచు
నామయోత్తేజమును ద్రుంచు నాక్షణమున
మారుత వశంబునకును గుఠార మనగ
నవనిలోనఁ బితామహాఖ్యాక రసము॥

గీ॥ ఘోర మగు రోగమను నసురాపారముకు జ
నార్దన సుతుండు సరి తన నామమొసగి
యవనియందుఁ బితామహ మను రసంబు
నావగా నొండు కల్పించె నయము మీర॥

## కైటభారి రసము

గీ॥ నలినసూతుని పేరటి నావఁగడప
దైత్యవిద్వేషి లోకహితార్థమునకుఁ
గైటభారి రసంబను కర్ణధారు
నొకని నిర్మించె నహహా! నీయుర్వియందు॥

గీ॥ గౌరి పాషాణ శిలయును గౌరిజమును
పార్వతీశుఁ శుక్లంబు భానుభాతి
నిమ్మ రసమున మర్దించి నిపుణముగను
చణక మాత్రంబు నిడ నష్ట సమితినణఁచు
సంకరము గ్రసించు మఱి యుపసర్గలణఁచు
కైటభారి రసంబు గ్రసు ఘరులు దీని॥

## లక్ష్మీనారాయణ రసము

చ॥ బలియును గాంచనప్రభను పారదక్షీర మయూరతుత్థ
ముల్
గలజరి వేరు నీరుచను ఖల్వములో నిడిమూరి యామముల్
నెలవగులైన వెజ్జులది నేర్పుగ పూటకు వల్ల మిచ్చినన్
నిలను గఫాదిరోగముల నింకఁగఁజేయు హరించునష్టముల్॥

కం॥ ఈ క్ష్మాతలమున నెన్నఁగ
లక్ష్మీనారాయణాఖ్య రసమంద్రము, మహా
యక్ష్మాది రుజలఁ గూల్చును
లక్ష్మీపతి *శుక్రశిష్యులనుగ్రసించుగతిన్॥

## భారతీ రసము

గీ॥ అభవు వీర్యోద్భవంబు కుష్ఠాపహారి
వత్సనాభియు వస సమభాగ మిడియుఁ
దాపసరసంబుచే నూరి స్థబ్ధరోమ
పుటము వేసియుఁ జల్లార్చి పోత్రిపిత్త

---

* రాక్షసులు

వెస డోలాస్వయ మొప్ప యంత్రమున సద్వేత్తల్ దగన్
వండియున్
వసుధన్ వల్ల మొసంగి రేని జ్వరసంభారంబు వాపున్ వడిన్॥

చ॥ సరసులు హీర విక్రమ రసంబని యంద్రు ద్విగుంజమాత్ర
మున్
మరిచము కోలపిత్తమును పావకమూలరసంబుచే నిడన్
బొరిగొను వాతపైత్యముల మోహరుజల్ బరిమార్చు
నుద్ధృత
జ్వరములఁగూల్చు నేడును పసన్నులఁ ద్రుంచుఁ బరాక్ర
మోన్నతిన్ ॥

## త్రివిక్రమ రసము

ఆ॥ వె॥ రుద్ర శుక్లభూతి రుద్ర భస్మంబును
కృత్యభూషణమును నేర్పుమీర
భృంగరసముచేత మృదువుగా మర్దించి
సిక్తయంత్ర మిడియు శీఘ్రముగను
వాడి సింధు వార పత్ర రసంబున
గుంజమాత్ర మిడిన ఘోరమైన
సన్నిపాతములను సంహరించుఁ ద్రివిక్ర
మరస మనిరి దీని ధరణియందు ॥

కం॥ రసములలోనఁ ద్రివిక్రమ
రసముగుణం బెన్నవశమె రసికులకైనన్
బసఁ దొలగించు జ్వరంబుల
వసుధను నేకాహికాది వర్గంబులకున్ ॥

## విజయ విక్రమ రసము

సీ॥ కాంచన ప్రభమును గాలకూటము శిలా
పైత్యాపహారి సౌభాగ్యములుచు
జంబీర రసమునఁ జతురత మర్దించి
యామంబు డోలికాయంత్రమునను

మునను వల్లద్వయం బిడ ముఖ్యముగను
నాహికము బాపు భారతి యను రసంబు

కళ్యాణ రసము

చ॥ దరభసితంబు గంధకము తాళకముఁ గూర్చి జంబళ
స్వరసము చెంతఁ గూర్చి తిగిజాలు విమర్దనఁ జేసి నేర్పుగా
మరిచము నెత్తు మాత్ర యిడ మాయును పైత్య సమీర
శ్లేష్మముల్
జ్వరములఁ ద్రుంచు దీని జవసత్వము నెన్నఁగ నల్ప శక్యమే।

గీ॥ అవనిలోపల దీని యాహ్వాయము నెన్న
రసికవరు లిది కల్యాణరస మటంద్రు
వింధ్యగిరి సన్నిభములైన వేఁకులకును
గుంభ సంభవుఁ డన నొప్పు కుంభిని, వయి ॥

శరభేశ్వర రసము

చ॥ హరతను భూతియుఁ బలి హాలాహలముల్ వెలిగారమున్
మట్రిఁ
హరతనుసంభవంబురు సమాంశము గూర్చియు నగ్ని
మూలత్వక్
స్వరసము గూర్చి నూరి యది శర్కర యంత్రముచేత
వండియుఁ
వెరవుగ గుంజమాత్ర మిడ వేఁకు లణంచు నమోఘ
మిద్ధరఁ ॥

కం॥ శరభేశ్వరరస మనదగు
గరుడుఁడు నురగములఁ బట్టి ఖండించుగతిఁ
బోగొను మారుతపైత్య
జ్వరముల నంటులను సత్త్వచతురత యొప్పఁ ॥

వీర విక్రమరసము

రసముఁ సైంధవగంధమాదినము మారాకింద్రి
యోద్భూతముఁ
వసనాభిఁ వృషవృక్ష బీజములతో హైదేహి సౌభాగ్య
ముల్

వండి విధిజ్ఞులు వల్లమాత్రము మత్స్య
పిత్తంబుచే నిడఁ బృథివిలోన
జ్వరకర్తనున్ బాపు సంకరం బణఁచును
ద్వంద్వాదిరోగ సంతాప మణఁచు

నిద్రసంభవమును గూర్చు నిర్ణయముగ
నంతరిక్షకుమారకు హితముసేయు
సతతమును రోగభయమును జారవైచు
నమృతము నటండ్రు విజయవిక్రమ రసంబు ॥

రసేంద్ర రసము

హారతముభూతి గంధకము నంబరభూతియుఁ గాలకూటముల్
హారి భసితంబు గూర్చియును నంస హయంబులఁ గూర్చి నేర్పుగా
సరసిజ పీఠిహోత్రమున శర్కర యంత్రముచేత వండియున్
మరిచము నెత్తుమాత్ర యిడ మాయుజ్వరంబులు సన్నిపాతముల్
చిఱుత చిగుళ్లడాలు నిరసించు
రసేంద్ర రసంబు భూస్థలిన్ ॥

మహేంద్ర రసము

గీ॥ చక్రివిషమును నృత్యభూషణము శిలయు
రసము దుగ్ధాశ్మమును స్వర్ణరసము గూర్చి
డోలికాయంత్రమున రెండుజాలు వండి
మాషమాత్రంబు నిడఁ బరిభ్రంశ మనెడి
నలినముల బట్టి పెకలించు నాగమనఁగ
నమరు క్ష్మాచక్రమున మహేంద్ర మనురసము ॥

లోకేశ్వర రసము

మ॥ హరిపత్రంబును వత్సనాభియును సూతైశ్వర్యముల్ హింగుళన్
ధరణిన్ నింబరసంబుచేఁ బ్రహర మాత్రంబున్ నదిన్ నూరియున్

[illegible] చే [illegible]
[illegible]
[illegible] సేయఁగ
[illegible] ॥

కం॥ లోకేశ్వరరస మందగు
లోకేశ్వరు కెల్లదగని లోకములోనన్
నాకౌరసమను పిత్తము
నేకతమునఁ గాల్చి చెత్య మింతగ జేయున్ ॥

రసరాజ రసము

కం॥ రసము శిలయు వెలిగారము
వస గంధము గూర్చి నూరి వల్లద్వయముగ
నొసఁగిన నుష్ణము లణఁచును
రసరాజరసం బటంచు రసికులు పుడమిన్ ॥

కాలభైరవ రసము

సీ॥ అరవింద భసితంబు హారతాళమును సింధు
క్షారద్వయము సర్జకారమునను
జోళంబు మరిచముల్ దోలికాయంత్రంబు
నారుజాముల వండి యూర్ధ్వవసులు
సద్బుద్ధిచే మత్స్యజలచర సూకర
కమఠ లులాయపిత్తములు గూర్చి
కజ్జలంబుగ నూరి కటుభద్ర రసమున
మాషమాత్రము నిడి మథిత మునెడి

తక్ర మన్నంబు శర్కర దధియు తోడ
నమలినంతట తృప్తమైన, నారికేళ
జలములును గోలవలయును జగతిలోన
ఘోరమగు పరిభ్రంశము గూల్చు నిజము
సప్త ధాతుజ్వరంబులఁ జక్కఁజేయు
కాలభైరవ రసమండ్రు ఘనులు భువిని ॥

సూచీముఖ రసము

సీ॥ గర్గసంభవమును భర్గవీర్యమును
భస్మ ప్రభ బు సౌభాగ్యమంజలి
మణిబంధ మణిశిఖ మాయూర తుత్థము
కాలకూటమును నేపాళములను
సౌవర్చ లవణముల్ స్థాణుశుక్లము గోధ్ర
పుష్పతైలంబున మూడునాళ్లు
భావనగావించి ప్రహరంబు డోలికా
యంత్రంబుచే వండి యాతమీఁద
సర్పపిత్తంబున జంబీరరసమున
భావన గావించి భవ్యమతులు
శతధృతిద్రావంబు శస్త్రంబుచేఁ జివ్వ
తర్జ్ఞాజం బద్ది తత్క్షణమున
వహ్నిచేఁ గాచివేసియు వసుధలోన
మూర్ఛ కంపంబు మాంద్యము మూఁగగల్గు
సంకర వ్యాధులను గూల్చు సత్యముగను
సూచికాముఖ రసమంద్రు సుగుణు లెపుడు॥

సూచికా భరణము

సీ॥ జాతరూపము భాను శస్త్రంగోహావిభూతి
కలధౌత వైక్రాంత గంధకములు
నంతరీక్షవిభూతి యవిభూతి త్రపుభూతి
వసనాభి శ్రీకంఠవపువిభూతి
సమభాగములు గూర్చి జంబీర శోభాంజ్ఞి
పావక, మధుపర్ణి, వాశ, ముండి,
కన్య మాతుల పాఠ కటుభద్ర లాంగలి
కారవల్లియు సింధువార సురస
రసముల గూరి యింపెసఁగ కాచకమూష
నిడి సిక్తయంత్రము నింపొనర్చి

## సూచీముఖ రసము

సీ॥ సూర్గసంభవమును భర్గ వీర్యమ్మును
భస్మ ప్రభంబు సౌభాగ్యమంజలి
మణిబంధ మణిశిలా మాయూర తుత్థము
కాలకూటమును నేపాళములును
సౌవర్చ లవణాల్ స్థాణుశుక్తులు నార్ద్ర
పుష్పతైలంబున మూడునాళ్లు
భావనగావించి ప్రహరంబు దోలికా
యంత్రంబుచే వండి యాతమీద
సర్పపిత్తంబున జంబీరసమున
భావన గావించి భవ్యమతులు
శతధృతిద్రావంబు శస్త్రంబుచేఁ జిహ్వ
త్వగ్భేదజం బద్ది తత్‌క్షణమున
వహ్నిచేఁ గాచి రేపియు వసుధలోన
మూర్ఛ కంపంబు మాంద్యము మూగగల్లు
సంకర వ్యాధులను గూల్చు సత్యముగను
సూచికాముఖ రసమంద్రు సుగుణు లెపుడు॥

## సూచికా భరణము

సీ॥ జాతరూపము భాను శస్త్రంగోహావిభూతి
కలధౌత వైక్రాంత గంధకములు
నంతరిక్షవిభూతి యవిభూతి త్రపుభూతి
వసనాభి శ్రీకంఠవపువిభూతి
సమభాగములు గూర్చి జంబీర శోభాగ్ని
పావక, మధుపర్ణి, వాశ, ముండి,
కన్య మాతుల పాఠ కటుభద్ర లాంగలి
కారవల్లియు సింధువార సురస
రసముల గూరి యింపెసఁగ కాచకమూష
నిడి సిక్తయంత్రము నింపొనర్చి

*జోగిరాజరసము

.... ... ...

బ్రహ్మాస్త్ర రసము

.... .... ....

నట్టి బ్రహ్మాస్త్ర సన్నిభమైన బలము
శౌర్యము గల్గు శత్రునాశనము వృద్ధ
రోగకారుండు నసమే రోగములకు
నిబ్బరంబుగ విడి చేసి నబ్బురముగఁ
బాము రోగంబు మృత్యువుఁ బారద్రోలు
వజ్ర సన్నిభ కాయుండౌ వసుధలోన ॥

అఘోరాస్త్ర రసము

సీ॥ పారద బులి నుల్లి పాషాణమును బలి
బహ్మితుత్థంబు నేపాళములును
కాలకూటము గంధకము తాళకంబుకు
సౌభాగ్యమునుఁ గూర్చి జంబీరసము
చేత మర్దనఁ జేసి శీఘ్రము బుడోలికా
యంత్రంబుచే నుడికి యహము లులాయ
తిక్తముల్ ఘటియించి త్రిదివముల్ మర్దించి
గుణవంతుఁ డంతట గుంజ యొత్తు
సరసి జాసారార్ధంబు, ఘృతమునను
చివ్వి నల్లిన, జ్వరము నశించు మోహ
రోగ నికరంబు బడిమార్చు రూఢ మిదియు
వసుధలోన నఘోరాస్త్రరస మటంద్రు ॥

కం॥ ఘోరమ్ముగ ఖరదైత్యుఁడ
ఘోరాస్త్రంబునను గాచె శూలి ధరిత్రిన్
ఘోరాస్త్రరసము నటువలె
ఘోరంబగు నుష్ణములను గూల్చక యున్నే ॥

*రస విష గంధక టంకణతాళి, త్రికటు, త్రిఫలా, సమ నేపాళీ
భృంగి పునర్నవ మర్దనకారి యోగిరసరేచనకారి (వైద్యయోగ రత్నావళి)

## పాశుపతాస్త్ర రసము

గీ॥ అపరిమోఘము పాశుపతాస్త్ర రసము
సేయు పనులను సౌఖ్యంబుఁ జెప్పతరమె
నరయఁగ నెట్లన్న పాశుపతాస్త్రమునను
గాదె గాండీవి యింద్ర సౌఖ్యంబు వడయుట !

## విష్ణుపరాక్రమ రసము

సీ॥ సైంధవ యావభస్మ సౌభాగ్య విషములు
తామ్రంబు గంధకంబు పారదమును
తుల్యంబు గూడి కృష్ణ ధత్తూర రసమున
ఘటియించి ఘుటికలుగా నొనర్చి
కుక్కుట పుటమిడి ఘోణి శఫర పిత్త
ములు గూర్చి మర్దించి ముఖ్యముగను
మాషమాత్రము నిడి మఱి శైత్యజలములు
త్రావనిచ్చిన నుష్ణతాప మణఁచు

సన్నిపాతనికాయంబు చక్కఁజేయు
కఫము మొదలగు దోషనికాయ మణఁచు
రసికవరు లిది హరి పరాక్రమ రసంబ
టంద్రు గుణమెన్న శక్యమే యజునికైన ॥

## ప్రళయానల రసము

సీ॥ పాదరసంబును పారదోద్భవమును
హాలాహలంబును హరివిభూతి
సౌభాగ్య జీరక తామ్రద్వయంబులు
దీప్యక పటుపంచ తీక్ష్ణలోహ
ములు ఖల్వమధ్యను మూఁడు యామంబులు
మాగధి సాగర మరిచములు క
షాయంబునను నూరి సరవి మూషను నిడి
యామాష్టకము సిక్త యంత్రమునను

వండి ఫణిపిత్తమును గూర్చి [illegible] బుగులు
నిడ సగ్భ్రంశి గుజలను [illegible]
ప్రాంత సేవకుం డిల్లను [illegible]
రస.... [illegible] రసవారము ॥

రోగవిదారణ రసము

గీ॥ భర్మ మాక్షిక సైంధవ భస్మశుక్తి
హాటకభ్రక విష శుద్ధ శుభ్ర గంధ
చపల పాషాణ త్రితి గుణముల్ సరవి గూర్చి
రాజరసమున మర్దించి రసిక వరులు
డోలికాయంత్రమున రెండుజాముల వండి
భానుపయముల కటు భద్రవారిఁ గూర్చి
మర్దితము జేసి గురువిందమాత్ర నిడిన
సంకరముఁ ద్రుంచు నాహిక జ్వర నికాయ
మణఁచు భువిలోన రుగ్విదారణ రసంబు ॥

వీరప్రతాప రసము

సీ॥ తామ్రవిద్రుమ హేమ తారభస్మంబులు
వత్సనాభియు రసభస్మము మఱియు
కటుకత్రయంబును ఖట్వాంగధర ధాతు
తూరముల్ త్రిఫలరసమ్ముఁ గూర్చి
చేత మర్దనఁజేసి మాతంగపుటమిడి
చల్లార్చి మాయూర ఛాగ మత్స్య
క్రోడ పిత్తంబులు గూర్చి మర్దనజేసి
గుంజమాత్రంబిడి గోరసంబు

కలుపు నన్నంబు లిడి యిక్షుఖండరసము
నారికేళోదకంబున నానిరేని
సంహరించును వింశతి జ్వరము లెల్ల
ధాత్రి నెన్నంగ వీరప్రతాప రసము ॥

## పరంజ్యోతి రసము

సీ॥ తాప్య మంబర విద్రుమ తార గంధ
వంగ రస తాళములు గూర్చి వరుస నివియు
జ్ఞాన పత్రరసంబునఁ గలయనూరి
సిక్తయంత్రంబుచే వండి శీఘ్రముగను
వల్లమాత్రంబునిడి సిక్త వారి గొన్న
మఱియు దధ్యన్నమును గొన్న జ్వరమణంచు
కఫ మపస్మారజనిత మాకంప మఖిల
వాతములఁ ద్రుంచు భువి పరంజ్యోతిరసము ॥

## రాజరాజేశ్వరీ రసము

గీ॥ పారదము నింగు దీక్ష్ణంబు భస్మమాక్షి
కంబు త్రిక్షార తాళక గంధకములు
నగ్నిరసమున మర్దించి యక్షణమున
మత్స్య పిత్తముతో నిడ, మాపి రుజల
రాజరాజేశ్వరి రసమ్మ తేజరిల్లు

## కాలాగ్ని రుద్ర రసము

సీ॥ వసనాభి త్రిక్షార పటుపంచరసములు
సమ మొనర్చి ఫలత్రిసారమునను
మర్దించి మూషను మాటి శర్కరయంత్ర
మొనరించి వండియు నొప్పుగాను
భూదార జలచర భుజగభుక్ సైరిభ
భుజగ మాహిష పిత్తములను గూర్చి
మర్దించి గురువింద మాత్ర మొసంగియు
సత్వరంబుగ నిక్షుసారమైన
నారి కేళోదకంబైన నాని పెరుగు
నన్నమునుఁ గ్రోలవల ను ను సక్షణమున
సంహరించును దోషత్రి సంభవముల
నణఁచు నుపసన్ని రుజలను నవనిలోన
రోగభయదంబు కాలాగ్నిరుద్రరసము ॥

గండభేరుండ రసము

సీ॥ నిష్క నిష్కార్ధములు చతుర్నిష్క సంఖ్య
దరద వసనాభి చక్రాంగిఁ దనరఁగూర్చి
శీతతోయంబుతో నూరి శృంగబేర
రసముచేతను గుంజెత్తు నొసఁగ నుష్ణ
తాపమును ద్రుంచు నాసిక ద్వంద్వములను
గండభేరుండ రసమంద్రు ఘనులు దీని ॥

మృత సంజీవి రసము

మ॥ మృత సూతంబును మత్స్యపిత్త విషముల్ మేషాక్షి చ్ఛ
సుద్ధాంశముల్
మృతగంధంబును గూర్చి యామయుగముల్ భృంగేంద్ర
నీరంబుచే
మతిమంతుల్ దగ నూరి వల్లమితినన్ మాన్పుచున్
దోషంబులన్
మృత సంజీవి రసంబటంద్రు నిదియున్ మేధానిధుల్
భూస్థలిన్ ॥

ధన్వంతరి రసము

సీ॥ ఖడ్గలోహ విభూతి గగనంబు ముక్తముల్
వర్ణమాక్షికము గురు స్వర్ణభూతి
మణిరాగము రసంబు మాగధి మాలతి
క్షారత్రయంబును సమమొనర్చి
కటమారి రసమున ఘటికాత్రయము నూరి
నంగారకు రసంబు నమర నూరి
యర్కపయంబుల నగ్ని రసంబునఁ
గటుపంచ రసమున గలయనూరి
వాలుకాయంత్రమున వండి పంచపిత్త
ములను గూర్చియు సేవింప మోహరుజల
రూపుమాపును మఱి యున్నరోగములను
బారద్రోలు ధన్వంతరి ప్రాజ్య రసము

ఫణిభూషణ రసము

సీ॥ తాళకము గుర్వపాలల్ దరదమును నభము
గలిపి కిటి మత్స్య మాహిష కచ్ఛపముల
పిత్తములఁ గూర్చి యరచిన్న మొత్తుమాత్ర
సింధువార రసంబున శీఘ్రముగనుఁ
గొన్న దోషత్రయంబులఁ గూల్చు మేహ
గద వినాశనముఁ జేయు గడియలోన
జన మొసఁగు భువిని ఫణిభూషణ రసంబు ॥

రోగభంజన రసము

సీ॥ శుద్ధ సూతాభ్ర విష శుద్ధశుల్బములును
జంబీర రసాన మర్దించి చతురముగను
యామమాత్రంబు డోలికా యంత్రమునను
వండి రెండు పీసములిడ వసుధలోన
శీతజోష్ణము లణఁచును శీఘ్రముగను
రోగభంజనరస మండ్రు రూఢముగను ॥

పాణిబుడా రసము

సీ॥ ఉరగమును గురు సూతంబు నొనరఁగూర్చి
కరిగి, తిమి పిత్తమున తోడ కలిపి యదియు
గుంజమాత్రంబు నిడెనేని గూల్చు రుజలు
ధాత్రిలోపల పాణిబుడా రసంబు ॥

కం॥ వసుధను సుగ్గాశ్మము నిం
పొసగఁగ పీసంబు సికతమును గూర్చియిడఁగా
బసఁ బొలగించు జ్వరంబుల
రసికులు నిది యేకమూర్తి రసమండ్రు భువిన్ ॥

వ॥ ఇది యేకమూర్తి రసము;

ద్విమూర్తి రసము

కం॥ నేపాళము దుగ్ధాశ్మము
గోపయసుల నూరి యదియు గుంజం బిడినన్
బాపును శీతజ్వరము ప్ర
కోపంబు ద్విమూర్తి రసము సుంభినిలోనన్

త్రిమూర్తి రసము

గీ॥ బర్హితుత్థము దుగ్ధాశ్మ పాలసు(తు)గ్ధ(గ్ధ)
ములను శుద్ధ మొనర్చియు మూండుపాలు
సర్పమారియు మాతుల సారమునను
భావితము జేసి గురువిందపాటి యొసంగి
పెరుగు నన్నంబు నిడెనేని పృథివిలోన
కంపమును రోమహర్షము గలుగు నుష్ణ
తీక్ష్ణమును బాపు భువి త్రిమూర్తియను రసము॥

పంచమూర్తి రసము

గీ॥ దుగ్ధపాషాణమును శిఖితుత్థ దుగ్ధ
ములును వర్ణప్రభంబును ముఖ్యముగను
కన్య రసమున మర్దించి గండుమీను
చేదు గూరిచి నూరియు శీఘ్రముగను
నావుపాలతో సేవింప నస్థిగతము
నాహికమ్మును శీతోష్ణమనిల పైత్య
శ్లేష్మ ద్వంద్వాది రుజల నశింపజేయు
పంచమూర్తి రసం బనఁ బరగు నదియు॥

సన్నిపాత దావానల రసము

మత్తకోకిల

పన్నగంబు విషంబు టంకణ పార్వతీశుల తాళముల్
వెన్న నెచ్చెలి శుక్లభూతియు సవ్యభేషజ గంధముల్
సన్నిపాతను నింబరసమున జానుగా మర్దించి సా
చిన్న మెత్తు నొసంగెనేనియు జిహ్వసంధిక తంద్రయున్
సన్నిపాతము లెల్ల ద్రుంచును సారసోద్భవుఁడైన యీ
సన్నిపాత దవానలంబును సన్నుతింపగ జాలునే॥

## చండభాను రసము

గీ॥ క్షీరతుత్థము తాళము శిల విభూతి
చతుసాగరమో(?) దశసంఖ్య గూర్చి
నూరి కుక్కుట పుటమిడి జీరకమున
మాష మాత్రంబు నిడెనేని మాయు ప్రాంత
వేకులును నాహికంబులు వేగిరముగ
చండభానురసం బంద్రు జగతిలోన ॥

## సూర్యపావక రసము

గీ॥ తుత్థములు దంతిబీజముల్ దొండిశిలము
చండికాశ్మము నృత్యభూషణము గూర్చి
కనక పత్రరసంబునఁ గలయ నూరి
మూషలో నిడి కుక్కుట పుటము వేసి
మఱియు కిటపిత్తమున నిడ జ్వరము లణఁచు
సూర్యపావకరస మంద్రు సుగుణు లెపుడు ॥

వ॥ మఱియును.

చ॥ హరిదళముఁ శిలాత్రయము నాసుధయుఁ శిఖిపాల తుత్థముఁ
సరిగ నొనర్చి మాతుల రసంబున మర్దన జేసి వీసముఁ
మరిచము క్రోడపిత్తమును మాంసము గూర్చి యొసంగ భూస్థలిఁ
సరసులు సూర్యపావకరసం బనియంద్రు హరించు నుష్ణముల్ ॥

## శీతగజాంకుశ రసము

కం॥ వసు ఋషి యుగ నేత్రములను
రసకము తుత్థమును విషము రసమును హేమ
ప్రసరమును గూర్చి గుంజం
బొసఁగిన నుష్ణములఁ ద్రుంచు నుర్వీస్థలిలోఁ ॥

కం॥ శీతగజాంకుశ మన ప్ర
ఖ్యాతిగ నెల్లడల బరగు కఫజోష్ణమ్ముల్
భూతజ్వర ద్వంద్వంబులు
శీతజ్వర మాహికములు శీఘ్రంబణగున్ ॥

వ॥ మఱియును.

ఉ॥ సూతము నాభి కప్పురయు శుద్ధి యొనర్చిన బద్ధి తుత్థమున్
మాతుల పత్రసారమున మర్దన జేసియు నాల్గు వీసముల్
శీతజలంబుచే నిడ నశించును నుష్ణము లుర్వ్యలోపలన్
శీతగజాంకుశంబనగ జెల్లును దీని నుతింప శక్యమే ॥

గీ॥ తుత్థయుగళంబు రసమును దుగ్ధశిలయు
నాగరంబును మరిచముల్ నాల్గు జాలు
కారవల్లి రసంబునఁ గలయ నూరి
కాననోత్పలములు దశకంబు పుటము
వేసి తిమి పిత్తమును గూర్చి వీసమెత్తు
సిక్తమున తోడ నొసగిన శీఘ్రముగను
శీతజోష్ణంబులను ద్రుంచు భూతలమున
శీత భంజన రస మంత్రము సిద్ధముగను ॥

నవనాథ రసము

సీ॥ సర్వజ్ఞశేతంబు సర్వవిషంబును
హాటక ప్రభమును హాలహాలము
శఖి కంఠతుత్థము క్షీరతుత్థంబును
దుగ్ధాశ్మమును బలి దొడ్డి శిలయు
సమము రసానలసారంబుచే నూరి
యారించి చక్రికా యంత్రమునను
మందాగ్నిచే వండి మఱియు చల్లారించి
మృగధూర్తపు . . . (?) సమ్మిశ్రముగను
మైలతుత్థము ద్వివిషముల్ పాలతుత్థ
మును కుచుదనమ (?) జలజమును కుమారి

వారిచేతను మర్దించి వల్లయుగము
మత్స్యపిత్తములతో నిడ మాయు కఫము
మారుతోద్భూత రోగముల్ మాపు పైత్య
మణంచు భువిలోన రసము నాగార్జునమ్ము ॥

## చోడసిద్ధ రసము

గీ॥ మూడు పాషాణముల్ తుత్థమును రసంబు
తాళకము సశ్మ చూర్ణంబు దంతిబీజ
ములను శర్కరవారిచే ముఖ్యముగను
యామ మాత్రంబు డోలికా యంత్రమునను
వండి యాఖుపిత్తముల నార్చి వల్లమాత్ర
మిడిన శీత జ్వరంబుల నుడుగఁజేయు
ప్రాంత వేళల భంజించు వాత మణచు
చోడ సిద్ధ రసం బంత్రము క్షోణియందు ॥

కం॥ పాలు నెఱుంగని యెడ సమ
పాలని మది నెఱుఁగ వలయు వసుమతిలోనన్
గాలము నెడలను ప్రాతః
కాలంబని తెలియవలయు ఘనతరబుద్ధిన్ ॥

గీ॥ రసము చెప్పనిచోటను రసికులార !
జీవనంబు ప్రయోగంబు సేయవలయు
మఱియు ఘుటికాప్రమాణము నెఱుగనెడల
మాషమాత్రము నని మది మరువవలదు ॥

## తోదకవృత్తము

మునిగణ సన్నుత! పుణ్య జనాంతా!
జనసుత వర్తన! సద్గుణపాత్రా!
వననిధి బంధన! వారిజనేత్రా!
ఇనకుల దీపక! యినసుతమిత్రా! ॥

## గద్య

ఇది శ్రీరామచంద్ర చరణారవింద ధ్యాన హృదయ ప్రదీపక సకల సుకవిజన విధేయ ధేనుకొండ జోగినామాఖ్యపుత్ర భిషక్ శాస్త్ర ప్రవీణ కేశవ నామధేయ ప్రణీతంబైన వైద్య చింతామణి తృతీయాశ్వాసము సంపూర్ణము.

ఇది తృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము

కం॥ శ్రీ సీతా హృద్వల్లభ !
వాసవభోగీశ వినుత వారిజనేత్రా
వాసవపుత్రవిమర్దన
దాసల సత్కల్పభూజ ! దశరథ రామా ॥

వ॥ అవధరింపుము. ఇంక నస్యాంజన గండూషాతిసారావధ
రోగానుపాన కషాయ క్రమంబు లెఱింగించెద.

## భస్మేశ్వర రసము

కం॥ పురసోము కళల సంఖ్యల
మరిచము వసనాభి చగణ ? భసితం బిడియున్
వెరవుగ నస్య మొనర్చిన
హరియించును సన్నిపాత మవనీస్థలిలో ॥

కం॥ తస్మాంహాయంబు ? నెన్నగ
భస్మేశ్వర రస మటంచ్రు బహురోగములన్
భస్మంబు జేయు శీఘ్రము
భస్మాంగునకైనఁ దరమె బల మెన్నంగన్ ॥

## అర్కేశ్వర రసము

గీ॥ అటవికోత్పల భసితంబు నర్కదుగ్ధ
ములును మర్దించి తచ్చూర్ణములకు నాల్గు
పాళ్లు మరిచంబు ఘటియించి పరికమొత్తు
నస్య మొనరించెరేని యవశ్యముగను
పైత్యము, నపస్మృతిని, సంఘవర్గ మణఁచు
నహహా ! యర్కేశు రసమెన్న నజుని తరమె ॥

కం॥ అర్కామయ తమమునకును
నర్కుండనఁ బరగు నిదియు నవనీస్థలిలో
.... .... ....
.... .... ....

## కాళికేశ్వర రసము

గీ॥ జాలినీ బీజ చూర్ణంబు జలధిసాఖ్య
నడియు వసనాభి మరిచముల్ పుడమి నేత్ర
సంఖ్య లిడి నూరి యది యు నస్యంబు సేయ
మూర్ధ సంవేదననుఁ బాపు ముఖ్యముగను
సంకరామయములఁ ద్రుంచు జగతిలోన
కాళికేశ్వర రస మంత్రము ఘనులు దీని ॥

గీ॥ మరిచ చూర్ణంబు నొక నిమ్మ-మాత్రమిడియు
మౌక్తికము నస్యముచు దిగనూరు సేయ
మూర్ధదోషంబు బాపును ముఖ్యముగను
మరిచచూర్ణంబు మఱి వర్ధమాన తైల
మునను నస్యంబు నేర్పుగా మూఁడు మార్లు
జేయ సంకరరుజలు నశించు భువిని ॥

## నస్య యోగములు

సీ॥ ఊషణ సైంధవ యుత కుంభసంభవ
పత్ర రసంబున పరగ నూర్చి
నస్యంబు జేయ నవశ్యంబు మోహాది
రోగంబులను వేగ రూపుమాపు
పిప్పలిచూర్ణంబు నొప్పుగాఁ గరక-శ
పయములచేతను భవ్యమతులు
నాస మందిడ వేగ నశియించు వింశతి
జ్వరములు నాహీకసంఘములను
సర్పమారి రసంబున సైంధవమును
వల్లిజంబును మఱియు వెల్లుల్లిరసము
నూర్చి నస్యంబు జేసినఁ గూల్చుదోష
సప్తకములెల్ల పైత్యరుక్సమితి నెల్ల ॥

గీ॥ ఈశ్వరీమూల చూర్ణంబు నిందుసంఖ్య
నిడియు తద్బీజచూర్ణంబు పుడమిసంఖ్య

* ఊషణము మిరియము

గూర్చి సార్ధంబు మరిచము ల్గూడనూరి
నాస మందిడ జ్వరము వినాశమొందు ॥

కం॥ గిరికర్ణి మూల రసమున
మరిచము వెల్లుల్లి గూర్చి మర్దించి వెసన్
వెరవుగ నస్య మొసర్చినఁ
బరిమార్చును మూర్ధ కంపభారము లవనీ ॥

కం॥ సరసిజహిత దళరసమున
మరిచము దీప్యకము లశున మణిబంధంబుల్
సరిగూర్చి నాసయం దిడ
హరియించును నాహికముల నవనీస్థలిలోన్ ॥

వ॥ మఱియును.

సీ॥ కస్తూరి చందన కర్పూర బాహ్లీక
స్వర్గప్రసూన విశ్వావధములు
మార్జాలవృషణ తమాలపత్ర, కచోర
మాగధీ హ్రీబేర మరిచమబ్ద
సోమన కాముకల్ సరిభాగములు గూర్చి
ధూమపత్రంబు తత్తుల్యమొసఁగి
భానుపయంబుల భావన గావించి
పన్నీట నత్తరుల్ పదను పరచ

నాసికాచూర్ణ మని యింద్రుడు నామమెన్న
నస్య మొనరించి రేవి యవశ్యముగను
బారద్రోలును పైత్యాపస్మార మెల్ల
మూర్ధసంభారముల నెల్ల ముఖ్యముగను ॥

అంజనములు

వ॥ మఱియు నంజనయోగంబు లెఱింగించెద.

## ప్రబోధాంజనము

గీ|| డిాశనపు బీజచూర్ణంబు త్రికటుకమును
సైంధవము ధేను మూత్రమ్ము సరవిఁగూర్చి
నూరి చక్షుల నిడెనేని ఘోరమైన
సన్నిపాతాది రోగముల్ సంహరించు
గరుడ సన్నిభదృష్టిని గల్గఁజేయు
ధరణిదీనిఁ బ్రబోధాంజనరస మంద్రు ||

## బాల సూర్యోదయము

గీ|| వకుళ బీజంబులును సింధువల్లిజమును
నిమ్మ నిమ్మ ద్వినిమ్మముల్ నేర్పుమీఱఁ
గూర్చి గవిమూత్రమున నూరి ఘుటిక జేసి
కేశరంజన రసమును గీలుకొల్పి
కనుల నిడిరేని దోషాదికములఁ గెల్చు
భాను సన్నిభదృష్టిని బడయఁజేయు
నంజనాహ్వయ మెన్నంగ నవనిలోన
బాల సూర్యోదయం బంద్రు భవ్యమతులు ||

గీ|| వాతనాశన బీజముల్ వల్లిజమును
సైంధవము ధేనుమూత్రము సరవినూరి
యంజనం బిడ సంధుల నపహరించు
నవని నిది యజ్ఞానాంజన మనఁగఁ బరగు

## వీరభద్రాంజనము

కం|| ఆ మందకి బీజంబులు
రామఠమును నిమ్మపల్ల రసయుక్తముగా
యా (నా) మార్ధము మర్దించియు
ధీమతి నది కనుల నిడినఁ దేజం బొసఁగున్ ||

వ|| దీని.

గీ॥ వీర భద్రాంజనం బంద్రు విశ్వమునను
మూర్ధసంవేదనలు మూగ మూర్ఛ
సంభవంబగు సంకరజాతి నణంచు
నంధులకు దివ్యదృష్టిని నబ్బజేయు ॥

ప్రకాశాంజనము

గీ॥ జలద కృష్ణరసాంజన స్వర్చికములు
నిమ్మరసమున మర్దించి నేత్రములను
నిడిన సాంకరరుజలను నుడుగజేయు
జగతిలోపల నిది ప్రకాశాంజనమ్ము ॥

గ్రంథాంతరమున

హింగుళాంజన రసము

సీ॥ మకర కచ్ఛప కిటి మత్స్యపిత్తంబులు
జఠర శిరీష బీజములు కృష్ణ
మరిచ వరాళ నాగరములు మారు--వ
రసమున మర్దించి రసికు లదియు
ఘుటికలుగాఁ జేసి గురువింద మాత్రము
నిమ్మరసంబున నేర్పుమీర
చక్షుల నిడిరేని సర్పవృశ్చికదోష
ములఁ ద్రుంచు సాంకరముల నణంచు
సంగము జ్వరదోషంబు చక్కఁజేయు
భూత ద్వంద్వాది జోష్ణముల్ పొంగణంచు
పైత్యమునపస్మృతిజ రుజల్ పారద్రోలు
హింగుళాంజన మని యంగు రిలను దీని ॥

సీ॥ చైత్రవైశాఖ మాసములందు రుగ్ణుల
కత్యుత్తమం బంద్రు ననవరతము
మాఘఫాల్గుణ పుష్య మార్గశిరమ్ముల
మధ్యాహ్న వేళను మంచిదంద్రు

భాద్రపదంబున పరగ శ్రావణమున
కంజనమ్మున కపరాహ్ణమునకు
అమరు రాత్రులయందు నాషాఢమునను జ్యే
ష్ఠమునఁ గార్త్తికిని నాశ్వయుజమునను

నవనిఁ గోపల దేశకాలాను గుణ్య
ప్రకృతి నెఱిఁగియు వైద్యులు భవ్యముగను
సలుపవలయును వైద్యంబు చతురముగను
సరస గుణులార ! వైద్యశాస్త్రజ్ఞులార ||

వ|| ఇంక గండూషయోగంబు లెఱింగించెద.

గండూష యోగములు

గీ|| కుష్ఠ నాగర జీరక యష్టిమధుక
శర్కరా తైల జంబీర స్వాదురసము
చేత మర్దించి జిహ్వాకు చేత నలఁద
దేహతాపము తత్క్షణమే హరించు ||

వ|| హిక్కలకు.

గీ|| కేకి పక్ష విభూతియు (కి ?) త్రితక శొంఠ
శర్కరలఁ గోడ మాక్షికసారమునను
కుళిర శోణితమున గూర్చి గుణాగరిష్ఠు
లగు మహాత్ములు జిహ్వక నలఁదిరేని
వెక్కులను ఛర్దులను బాపు నిక్కువముగ ||

గీ|| అయినతి ము(?) శొంఠి టంకణత్రయము తేనె
శర్కరయు గూర్చి జంబీర సారమునను
జిహ్వ లేపనమును జేయ శీఘ్రమునను
ఛర్దులను బాపు నరుచిని సంహరించు ||

గీ|| స్వర్చికంబును నింగువ సైంధవమును
మరిచమును శొంఠి పిప్పళ్లు మాతులుంగ

సారమున నూరి జిహ్వను చతురముగను
నలఁద సంకరరోగములణఁచు భువిని ॥

చ॥ మరిచ మహౌషధీ త్రితక మాగధి భూగృహధాతు సైంధవా
కర్కర కర కుష్ఠ రామఠ స కాముక స్వర్చిక టంకణంబులున్
సరిగ నొనర్చి దంత శఠ సారముచేతను నూరి జిహ్వకున్
మరి మరి నద్దిరేని బరిమార్చును సంకరరోగవర్గమున్ ॥

కం॥ రుద్రాక్షయు బింబంబును
విద్రుమముచుఁ గూర్చి నూరి వెరవుగ వైద్యుల్
తత్ద్రవము జిహ్వ కలఁదిన
నుద్ధృత మగు మోహరుజల నుబ్బణఁగించున్ ॥

వ॥ ఇంక ధూపయోగంబు లెఱింగించెద.

గీ॥ గంధ బిల్వ మహాఫల కాకజంఘ
గౌరి ఖరశకృత్కుశయుగ కాకపక్ష
ములు ఘటించియు ధూపంబు ముఖ్యముగను
వేసిరేనియు బ్రబలంపు వేఁకులణఁచు ॥

గీ॥ ఓమమును దర్భలు కుళీర రామఠములు
తులశి వేరును వెల్లుల్లి ధూప మిడిన
శైత్యముహరించు వెక్కిల చక్కజేయు
నాహికంబులఁ బరిమార్చు నవనిలోన ॥

కం॥ పుర హింగు కృష్ణజీరక
సరషప కుశభానుకుసుమ జామోదములన్
సరిగూర్చి యామదంబున
వెరవుగ నిడిధూప మిడిన వేఁకులణంచున్ ॥

గీ॥ కేకి పక్షమ్ములును గుశ కృష్ణ బల్వ
సర్పనిర్మోక లశు నాజ్య సర్షపౌతు
మల ఖపుర దీప్యములును సమానముగను
గూర్చి ధూపంబు నిడిరేని ఘోరమైన

సంకరా మయములఁ బాపు జగతిలోన
నాహ్వయం బెన్న నాగార్జునం బటంచ్రు ॥

## క్షేత్రపాలక ధూపము

సీ॥ హారిణోత్పలంబును నహికవచము భృంగ
పక్షంబు సూకరోత్పలము కేకి
పక్షంబు లశునంబు పటు దీప్యకము లక్క
కాకజంఘంబును కౌశకమును
మహిషాక్షి దేవధూపము హింగు (...)
ఖట్వాంగ చిరిబిల్వ గంధబిల్వ
మున్నాదినీ కృష్ణ వృశ్చికాళులు గూర్చి
యాతపంబున నార్చి యంతలోన
గుణు లులూకంబు నిడివేగ గుమ్మ యదియు
ధూప మిడిరేని రోగముల్ తొలఁగజేయు
రూఢ మిది యండ్రు దేహ మారోగ్యమిచ్చు
క్షేత్రపాలక ధూప మిాక్షితి తలమున ॥

గీ। కలుమదమ్మును మహిషశృంగమును నరళు
లశునమును చిలువకూసంబు లక్క కేకి
పక్షమును గూర్చి సూతికా భవనమునను
ధూప మిడిరేని భూతముల్ తొలఁగజేయు ॥

వ॥ ఇంక నతిసారంబుల కౌషధంబు లెఱింగించెద.

ఉ॥ జాతిఫలంబు శొంఠియు రసాలశలాటు సువర్ణబీజముల్
మాతవిషంబ ఫేనమును భంగురముల్ సరిగూర్చి కుండలీ
మాతుల పత్రసారమున మర్ధనజేసి యొసంగ నిమ్మముల్
వాతకఘాతిసారముల పైత్యమునుల్ బరిమార్చు
భూస్థలిల్ ॥

## గజకేసరి

గీ॥ కోకిలప్రియ బీజముల్ కొడిశ శొంఠి
ముస్తలను నాభి వెలిగారమును ఘటించి
జ్ఞానపత్రరసంబునఁ గలయ నూరి

కతక ఫలమాత్ర మిడిరేని గడియలోన
ననిల పైత్త్యాతిసారములణఁచు నిదియు
నవని గజకేసరి యన యంద్రార్యవరులు

గీ॥ కుంజరాక్షి యఫేనంబు కుటజఫలము
నాగభసితంబు ధాతకీ నాగరమును
భంగురము టంకణంబును వత్సనాభి
కనక పత్రరసంబునఁ గలయనూరి
కుంజరాక్షి ప్రమాణంబు ఘుటిక జేసి
యొసఁగ పిత్తాతిసారము పస దొలంగు ॥

సీ॥ విజయ నాగర ముస్తాతివిష రసాల
మజ్జ ఖట్వాంగ శాండిల్యమజ్జ కుటజ
చపల జీరకములు మరి సామజాక్షి
మజ్జనము జ్ఞానపత్రంబు మాక్షికమున
మర్దితము జేసి నిష్కార్ధమాత్రమిడిన
బారద్రోలును పైత్త్యాతిసారములను
ధరణిఁగొపల నతిసారదారుణంబు ॥

వ॥ ఇంక రోగంబులకు నౌషధానుపానంబు లెఱింగించెద.

గీ॥ శృంగిబేరము త్రికటుకల్ సింధు శిగ్రు
వరుణమును పీలు యవభూతి వహ్ని భాను
చపలమూలంబు లివియెల్ల జగతిలోన
మోహరుజలకు ననుపానములు నటండ్రు ॥

గీ॥ ధాన్యక మృణాల జీరక ధాత్రి కుష్ఠ
చందనోశీర శర్కరా చంద్ర కుముద
భద్రముస్త మృణాళక వాలుకములు
దాహశమనంబు లివి యెల్ల ధాత్రిలోన ॥

## హిక్కలకు—ఛర్దులకు

సీ॥ ఉద్గారశోధన ? పూతన హ్రీబేర
బీజపూర లవంగ బిల్వ శతి త
మాలపత్ర మధూక మలయజ శర్కర
యేలా లవంగ కంకోలమజ్జ
సోమన ఘనసార జాతీఫలంబులు
మానుగా ఛర్ద్యనుపానములివి
భ్రమరాలయంబును బర్హిపింఛంబును
మధుకంబు మధువపామార్గబీజ

ములును యవభూతి తృటుల్కళి సలిలములును
వెక్కులకు నెల్ల నివి యెల్ల నిక్కువముగ
మంచివి యటంద్రు సద్బుద్ధి మంతులెపుడు ॥

.... .... ....

## జ్వరములకు

కం॥ సురలోకప్రసవంబును
సురగము తత్పల్లవంబు నుపకుర్యమ్ముల్ ?
మరిచము వహ్నిరసంబును
జ్వరులకు ననుపానమంద్రు సర్వజ్ఞులిలన్ ॥

కం॥ జీరకము నార్ద్రికంబును
వారిదమును శర్కరయును వాశామృత త్వ
క్సారములు శృంగరసమును
ధారుణి నివి మేలు నుష్ణతాపంబునకున్ ॥

వ॥ ఇంక కషాయంబు లెఱింగించెద.

## వాతజ్వర హారకషాయములు

కం॥ నశిలింగము కుండలియును
శిశిరంబు మహౌషధంబు జీమూత బున్

